# అంకితము



## కీ॥ శే॥ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారికి

అధునాతన సంస్కృతికిని
ప్రధానబీజమ్మ వీవు పాండిత్యపయో
నిధి వీవు మార్గదర్శక
సుధారుచివి నిన్ను మఱవఁజొచ్చిరి యాంధ్రుల్.

ఆంధ్ర విజ్ఞానసర్వస్వ మద్ది నీవు
మొదలువెట్టితి మా కది కుదుర లేదు
ఆంగ్ల విజ్ఞానసరస్వ మట్లు దాని
వెలయఁజేతుము క్షమియింప వే! మహాత్మ!

నీ రచిత వ్యాసంబు లు
దారంబగు నీదు నాత్మదర్పణముల్ నీ
సారమతి ముద్రగల్గిన
యారంభంబులకు విజయ మగుత మహాత్మా!

సంఘ సంస్కారభావ మిశ్రమముగాని
యచ్చ సంస్కృతి నీ యాత్మయందె వెలిఁగె
యచ్చ సంస్కృతి తెలియని యాంధ్రజాతి
యాధునిక మిది పలుత్రోవలై చలించు.

ఒకకంట సున్నమును వే
ఱొక కంటఁ జెల్ల మన్న గొప్పగ సూర్యుం
డొకకన్ను తుహినకిరణుం
డొక కన్నిక లొక వెట్ట లుండును తండ్రీ!

ఒకచక్రము మీఁద మరిం
కొక చక్రము నుడిసె బండి రొండుదూనః కయి తే
ప్పక జోల్త్రాపడుటయు గతు
కుఁడు పడుటయు సాఁగుటయును గూలఁబడుటయుఁ.

ఇంత ముద్దుతోడ నెంత కోసమ్మైన
నోర్వఁగలుగు శక్తి యమరియుండ
కేరి యింతవఱకుఁ దెప్పించవచ్చును
రాదటంచు లెక్క యేది? నీకు.

పోరులాడి భార్యఁ బుట్టింటినుండి తీ
సికొనివచ్చి రైలుస్టేషనందు
నువిద, మగఁడు, ప్రేమయును గోపమును దోఁపఁ
జూపు లొకరి నొకరు సూచుకొనిరి.

మనయింటి కెదురుగా నుం
డినవారల కూఁతునకును నిజముగఁ దేల్కు
ట్టిన దని యడిగి తెలిసికొని
వనరుట నీ జాలిగుండెవలననె ప్రియుడా!

వాసికి సంఖ్యాశాస్త్ర
జ్ఞానము మిక్కిలి పరీక్ష 'నంబరు' తనకుఁ
గాని దని మిగులఁ జదివియు
హాసిని శంకించి, యప్పుడె 'హాలును' వీడెఁ.

ఒకకంట నున్నమును వే
ఱొక కంటఁ బెల్లమన్న గొప్పుగ సూర్యుం
డొకకన్ను తుహినకిరణుం
డొక కన్నిక లోక మెట్లు లుండును తండ్రీ !

ఒకచక్రము మేడ మఱిం
కొక చక్రము గుడిసె బండి రొండుదూపః కయి త
ప్పక జోల్లాపడుటయు గతు
కుడు పడుటయు సాఁగుటయును గూలఁబడుటయుఁ.

ఇంత ముద్దుకోడ నెంత కోపమ్మైన
నార్పఁగలుగు శక్తి యమరియుండ
తీరి యింతవఱకుఁ దెప్పించవచ్చును
రాదటంచు లెక్క యేది? నీకు.

పోరులాడి భార్యఁ బుట్టింటినుండి తీ
సికొనివచ్చి రైలుస్టేషనందు
నువిద, మగఁడు, ప్రేమయును గోపమును దోఁపఁ
జూపు లొకరి నొకరు చూచుకొనిరి.

మనయింటి కెదురుగా నుం
డినవారల కూఁతునకును సజముగఁ బేల్కొ
ట్రిస దని యడిగి తెలిసికొని
వనరుట నీ జాలిగుండెవలనని ప్రియుడా!

వానికి సంఖ్యాశాస్త్ర
జ్ఞానము మిక్కిలి పరీక్ష 'నంబరు' తనదగా
గాని దని మిగులఁ జదివియు
హాసిసి శంకించి, యప్పుడె 'హాలును' వీడెఁగా.

నన్ను మీ గృహపట్టి యుంచెదరను, నన్నుఁ
జూడనే లేదు మీరు మీ సుదతి పుట్టి
నింట మే ముద్దె కంటిని నేను మిమ్ముఁ
జూచితిని మీరె నన్నెప్డు చూడలేరు.

హాస్యమునకు నల్లు రతనిఁ బట్టించెదరు
మెలఁతమగఁడు నట్టె మెదలకుండు
సుదతి కంటిబిగువుచూపు లెప్పడినను
ఎవఁడు వానికోలి కేఁగఁబోడు.

ఆ చిఱుత సిగ్గుపడుచుఁ దియమ్మ వచ్చి
నట్టి నంకాయ లేమొ వ్రేళ్ళంత సన్న
పొడుగు మీ వ్రేళ్ళు, నంకాయ, లింత లైన
ఁమనో వ్రేళ్ళు లెప్పుడు నంగరానియంత.

ఎద పలుచ నంచు దీనత
మది నగచుచు నేల పలుక మదిరాక్షీ? నీ
యెద బరువుకంటె బరువై
ముసు కగు నీ పిఱుందులందు ముదరా వచ్చెన్.

పేరంటమునకు వచ్చిన
వారి పడుచు తాల్చినట్టి పలుకఁ బోగడ నీతో
నేరిచినయంత నేరువ
మారా! మే మాడువార మయ్యును ప్రియుఁడా!

కొన్ని యేండ్లనుండి కోపలికేసి నేను
నొకరిమీఁద నొకరి నుండవచ్చు
పొసగువేళ నేర్పుపస లేకయుండిన
గిడసవారి మనుఁడు బెడిసిపోవు.

గడుసులు నాయకు లసి పే
ర్వడసి కులములంచు దేశభాగములందుఁ
గడనకయి కీర్తికయి యవి
విడివిడి వసి ద్వేష మెట్లుఁ బెంతు రలఁతులఁ.

ఓయి! మనసుకాడ! యొకవేళ సాహస
మ్మాచరించె దేసి ఆచరింపు
పరువు గలిగినట్టి పడతులయెడలఁ, గా
దాయె నేని అవ్వ యనుచు లేదు.

ప్రక్కయింటికి మఱి క్రొత్తవార లెవరో
యద్దె కరుదెంచి రంచుఁ బూ లముగఁబోయి
నానరమువోని యా మగవానిఁ జూచి
లేమ పూ లముగంగఁబోలేదు మఱల.

కొంచె మెఱ్ఱనిసంజయుఁ గొంత తెలుపు
తిరుగు కేశితోడ పడమటిదిశ నెలంగె
కోపము ప్రసన్నతయు రెండుకూడ మగనిఁ
గలియఁజేరంగఁ జను కులాంగనయుఁబోలె.

గొప్పవారలు మఱి వారుకూడ సిల్లె?
అనెద వేటికి? నా గొప్ప యనఁగ నెందు?
చదువు ధనమును నధికారసరణియందు
కామమును క్రోధమును శాంతి గనుటఁ గాదు.

అతఁడు పరదేశ కవిగ్రంథ మందుకొనిన
గుణములే గుణమ్ములు తాళుకొనఁగలేదు
అట్లనె స్వదేశకవి గ్రంథ మందుకొనిన
మఱియుఁ గనపడె నాసి విమర్శశక్తి.

నాస్వ్య మైనపిదపఁ గమలాక్షి ప్రియభర్త
తన్నుఁ జూడరాఁగఁ దడసినంతఁ
బూలుకోసి తెచ్చి ప్రోయి రాఁజవేయుఁగ
నవ్వు నవ్వు మనుచు నాడుచుండె.

మీా యింటను మా యింటను
వేఁడుజనము పండి రొల్ల వేళల నుండెఁ
నీ యూ మాపులు వీటం
బోరెదు మదనునకు వార పోసినయట్లున్.

అట దోఁటవారి బాలిక
యటు నిటు కన్నెత్తిచూడ జరిగెదువారిన్
చిటిక విసపించుకో ద
కుటిలాలక మగఁడు నర్భకుఁడు చూడంగన్.

లేమ కెంత సిగ్గు లేదు, నా యెదుట న
డేసు చూపు మరి య దేమిమాట
మొలత కైన నంత మీఁదమీఁద నుండిన
వచ్చు భార్య యెదుట వలవవలెనో?

నాకు నలుఁబదియేండ్లు లున్న వసి నీదు
భావమో యేమొ కట్టుడుపండ్లు నాని
నెల్ల తలకు రోజును రంగు వేయుచుండుఁ
జింత చచ్చినఁ బులుసు చచ్చినదో! పడుచ!

ఇంతి! నీవు పుట్టినింటికిఁ బెండ్లికి
నరుగ నీదు మేనయత్త కొడుకు
నచ్చు నీవు గాసి పగలు రే మీ యమ్మ
నొకట-యింత విడచి యుండఁబోకు.

ఇంత యిలు వీడనట్టి శుద్ధాంతకామి
నులకు మరియాద గల మనుష్యులును భర్త
యొక్క-మిత్రులు చాటున కొందుగవలసి
నట్టివారలు తక్కు-వా రాత్మజాతి.

ఔరా! పెండ్లము! ఊరున
నూరేగింపునకుఁ గ్రొత్తయుడుపులు వలయుఁగా
కోరిక గల పతి నాకడఁ
జేరడిచోఁ బనికిరాని చీరలు చాలుఁగా.

బందుగుల నా మహాకవి ప్రతిభపట్టి
రాసి దైవతి యింతమాత్రమ్మె వరుస
యైనఁ జాలిపడు కాను బ్రహ్మాండముగ వార
లో! సరస్వతులే! సత్యలోక కథలు.

మెల్ల నేడాది తిరుగని పిల్లవాఁడు
కాళ్ళపై వంగి సందుగాఁ గాంచు చుండఁ
దాను కొట్టిన, నవ్వేడు తండ్రిఁ గాంచి
యింతి వలపు చిప్పిలునట్లు లీసడించె.

ఆమె పదియేండ్ల కొడుకుపై కంగజుండె
కాని లోనూహ యెఱ్ఱయేగాని లేదు
వందకొరుకులు కొరికితి వాఁడు తిరిగి
కొడుకవలె నన్ను యూహాయే యెఱుఁగఁబోడు.

ఊరిభార్య లెల్ల నూహించి యామె మం
చంబుతో నిడిరి శ్మశానమందు
నట పిశాచకాంత లాలోచనముచేసి
పడతి మఱల నూరినడుమ నిడిరి.

తనువున నత్తరు రాచుక
ధనికుఁ డొకఁడు వీధిఁబోవఁ దగఁ బురి దుర్వా
సనఁ బోఁగొట్టుట కని యా
తని యౌదార్యంబు మెచ్చెదరు భూమిజనుల్.

వార్ధకంబున యౌవనవతికి మగఁడు!
నీను నీటును చదువును నీ ధనంబు
వలదు యువతికి జిహ్వకు వలదు పరిమ
ళంబు, సంగీతమును, శీతలాసలంబు.

వ్రేళ్ళు వ్రేళ్ళు తాఁకి పికిలి పికిలియు నాస్త్
బుజము బుజము రాచి పోల్చుకోదు
రైలులోన జొమ్ము రాచినప్పటి కైవ
సులికిపడియెఁ బల్లెటూరి పిల్ల.

స్కూలుపిల్లల మిస్సమ్మ చూడు మదిగో
రాలిపడు కొంగఱెక్కయుఁ బోలె నడచు
ఉన్న సుంతయుద్యోగము నూడినట్టి
కాయజన్ము పాళీలేని కలమువోలె.

చిన్నయుద్యోగ మిమ్మని చేరఁబోవ
బ్రాహ్మణుఁ డవని గుమ్మమ్ము పారఁదోలె
బ్రాహ్మణుండౌ కలెక్టరు వచ్చినంత
నడుగు నడుగున వలిపపు మడుగు లొత్తె.

అవునె; మఱి కరివేపాక టించు నీవు
నింటిచుట్టును తిరిగెద వెన్నిసార్లు
కుంది! నీకును పైమండ లందవాయె
సగము నంగుళ మైనను సాఁగవాయె.

రెండవు గోళమ్ములపై
రెండవ్వగోళములు తిరుగుకీతిని "సర్కస్"
పెండాలున నున్నట్లుగ
నండజగామినియు నడచు నందము కంటేం.

వాఁడు పత్రిక పెట్టెను వ్రాసి కేమి
చదువువచ్చున టంచుఁ బ్రశ్నయున? దిన ది
నమ్ము వాఁడు విప్పెడు పురాణమ్ముమ్ముందు
మూఁడులోకంబులును డీలుపోవుచుండ.

ఊరిలో వాని కులకాంత యుండినపుడు
ప్రొద్దుటనె వంటయింటిలోఁ బొగలు తోఁచు
నతనిభార్య పుట్టింటికి నరిగనేని
పగలు పగలు చావడియెల్ల పొగలు పొగలె.

అగు నదృష్టమ్ము దురదృష్ట మద్ది యిదియు
యిద్దియది యొక్కొక్కప్పుడు నిట్లు చూడు
పరాసుకత్తియ రాణి తా నభిలషించె
నతసి మఱునాఁటినుండి వాఁ డసలె లేడు.

రైళ్లు రేడియోల్ తంతివార్తలును గలుగు
కాలమునఁ జిత్ర మింత దగ్గరయు నైన
నచట మా యూరఁ గొంపల నార్పినట్టి
యతఁడు మీ యూర నింత వేదాంతి యెట్లు?

అధమకోకిల లెల్ల వాయసము లైన
మనము పెంచెడుచోఁ బెరిగినవి; వాని
కూఁత పంచమస్వర మఁట! కొసకు నేఁడు
స్వరములందున మనల ప్రసక్తి లేదు.

ఘనుఁడు క్రొత్తఁగ వచ్చె నింగ్లాండునుండి
రాతిరి భుజించుచుం డమ్మొ, మాత తలను
నీళ్ళలం జిల్కి "యెచట జన్మించితి" వన
డాబుమై గ్రీనువిచ్చి లండనులు చెప్పె.

అడిగెఁ గొండవీఁట నప్పుడు శ్రీనాథు
డీవు కవివా యనుచు నెవరినోను
అడుగు నేమొ యిప్పు డతఁ డున్న మీ యూరు
వచ్చి పత్త్రికాధిపతివా యనుచు.

మఱియు పయి యధికారియును మంచివాఁడే!
యంచు నడిగెదవా! చాల మంచివాఁడు
పేర్మిఁ గొత్తగుమాస్తా విధీతపత్త్రికను
బంపినాఁడు బన్నాశపు పట్టుచీర

అల దుకాణముపై నమ్మనట్టి యతివ
ముఖముచూడంగ యువకులు మూఁగు చుండ్రి
ప్రియపడి కొయుకొందు దమ్మిడీపెట్టి కొనఁడు
చేయి తగులునో యన్న భీచేత నుదరి.

వారి కులమున లేదన్న వాక్కు లేదు
తండ్రులతరంబు పుత్రులతరము రెంట
ఎల్లతంద్రులకును చేతి కెమ్మ లేదు
కొమరులకుగాని రక్తమాంసములు లేవు.

కొండలకు మైత్రి నెఱపెడి
కందనకాయయును నసలె కలుగదు వారు
చందిరుని వెలుఁగునవ్వుల
నుందురు జాగ్రత్తపడవె యో మృదుప్రకృతీ!

మొదల, బిరుసైనకన్నుల యుధుటు చూపె
పనరుహాక్షి సంబాళించుకొనఁగలేదె.
ఊహామొయి నీవు చీరకొం గొడిసిపట్ట
నింటి కరుదెంచి మఱి తమాయించు నిపుడు.

పూర్వ మిద్దఱు చెలికాండ్రు మొదటివాఁడు
పరులకొంప లారిచి తిరుపతికిఁ బోయె
వీడు దుష్కార్యములును దుర్విధులు చేసి
నాచమించు సహస్రగాయత్రితోడ.

పతి దైవమ్మను సర్థము
సతియు క్షణము క్షణమునందు సార్థకపరచెఁ
వ్రతపుం బీటలపై నను
పతి నంటుక నొక్కటె గురుపాదై యునికిఁ.

ఇచట దిబ్బవెట్టి యచట పాయను తీయు
ఏఱు చూచి యతఁడు నూరు ఫందె
తన్ను నమ్మియుండి యిన్నాళ్ళు నేఁటికి
పరుసియొద్ద నున్న తరుణిఁ దలఁచి.

అమృత మన నెట్టు లుండునం చడిగె దీవు
సకియ! యది నీకుఁ దెలియు టసంభవంబు
చంద్రునకు నెట్లు తెలియును చంద్రుఁ డింత
చల్లఁగా నుండు నని, యది జగ మెఱుంగు.

మగఁడు దాసిని రమ్మని మగువ యేమొ
దాసితల్లిని రమ్మని తమరియింటి
యందుఁ బనిచేయుటకుఁ దగవాఁడ నవ్వి
తనకు రావీలులే దనె దాసి తల్లి

ప్రాణనాథు బొమ్మపైని మేల్కొనియుండి
కన్నులారఁ గంటి వెన్నెలలను
మెలత! రాతిరెల్ల మేఘాలు క్రమ్మను
ఉఱిమె, మెఱిసె, యట్టె కురిసె ననెదు.

నమ్మ, వాపిరిగొట్టుతనంబు గాన
చిన్నమెత్తైన మఱి సాహసింపలేదు
నదికి స్నానమ్మునకు వచ్చినాడు మొన్న
భయమటంచును నీటిలోపలికి దిగఁడు.

బావ! "డార్వెను" చేసిపోవఁబట్టె నయమా
వాఁడు చేసిన పరిణామవాదమందు
దొరకలేదట లంకె ఆ దురుసువాది
అట్టె నన్నుఁ బట్టుకొని లంకె యనియె నండు.

వనిత! నీ వల్ల చివురాకువంకఁ గనకు
అది మదను నైంద్రజాలిక పదనుబాకు
ఎన్నిరూపాలు దానికి నిప్పుడు కత్తి
అంత పులినాల్క యంతలో నగ్నిజిహ్వ.

'శాఖిమా' మ్మని పడమటిశాస్త్రిఁ దూర్పు
శాస్త్రి నడిగితి నితఁడు భాష్యములు, నతఁడు
ఫ్రెంచి రష్యను గ్రంథముల్ విప్పినారు
పిసరుసారాంశమును తేల్చిపెట్టకుండ.

నీకు నుద్యోగ మింతయు లేక నాలు
గేండ్లుగా స్నేహితుల బిచ్చమెత్తు చుంటి
వీధివాకిఁట నిలచిన బిచ్చగానిఁ
గూలి సేయరాదా! యను కోపగింతు.

దాని కదే దీసి కిదే
దేని కదే వాసి పాండితీమహిమంబుల్
వానిప్రవర్తన, బోధ
స్థానంబులు రెండుగావె! తానును! శిష్యుల్.

వీధి పంపుకాడ వేయిబిందెలు నొక్క
మొగిని నిండినట్లు పొంగిపోయె
తాను మన్మధునకు మేనత్తకొడు కేమొ
అతఁడు వచ్చి కాళ్ళులందుఁ గడుగ.

ఓయి! మా తోటలో నున్న కోయిలకును
గొంతులోన సన్ననిజీఱ కొఱఁతవోయె
అద్ది విరహిణి కాఁబోలు నకటకట
మంట నిప్పాయెఁ దినుటకు మావిచివురు,

అల్ల యాంబోతుకడ నెదయైన యావుఁ
గట్టివేసిరిఁ తొలఁగిపోఁగాక యుండ
తొలఁగిపోవదు గుమ్మాన నిలచి చూచు
చెయిదిఁ దిమిరంపుగుబ్బల వయసుకత్తె.

పొలతి! పతితోడఁ బోరాడి బుట్టినంటి
కరుగుదెంచితి వేఁడాది యయ్యె నెవఁడు
గాని నీవంకఁ గన్నెత్తి కాంచరాదు
అట్టి నీ తలయంతయు నట్టకట్టె!

ప్రథమభార్యను రాచి అంపానఁబెట్టి
నతని కీయను నా కూఁతు ననుచు నీవు
నెఱుఁగక వచింతు, నీ కూఁతు నిచ్చి చూడు
అతని నెత్తిపై దేవత యగునుసుమ్మ,

మూర చాలియు చాలని చీరకట్టి
చిన్ని చెంబుతో నీళ్ళులు చేదుకొనఁగ
నెన్నిసారులు వచ్చునో యింతసిగ్గు
పడుచుఁ బడుచు శృంగారపు బావికడను.

గొడ్డు వచ్చిన వేళయుఁ గొమ్మ వచ్చి
నట్టి వేళయు; రంభ యా నతని భార్య
కాపురమునకు వచ్చెను ప్రాపకములు
నింతలో వాని కవి యెన్ని యెన్ని దొరకె!

అటు వరుస వెలవెలందులు
నిటు వరుసను లేచివచ్చి నెలనాగలు తా
నటు గడప గడప ముసలిది
యిటు పెంపుడుకుక్క—పిల్ల లింటింటఁ బడిక.

వాని కులములోని వనితల యూరిలో
నడక నీకుఁ దెలియు నాకుఁ దెలియు
ఇతరకులము వారి యింతులఁగూర్చి
వాఁడు చూడు మాట లాడుతీరు.

భూపతులు విష్ణునంశను బుట్టి రనఁగ
నవ్వేదు సమానములు లక్షణములు చూడు
తల్లక్రిందులుగా నీవు తపసుచేయు
దర్శనమె కాదు మఱి వరదానమున్నె.

జిలుగుపయ్యెద గంజికుచ్చెలలమ్రోఁత
గందమును మల్లెపూవుల కమ్మతావి
కలసి నడచుచు నున్నట్లు గానిపించు
బండువెన్నెలలోపలఁ బయన మెటకొ!

నీకుఁ జలివేయ దనుటయు నిక్కువంబె
ఒడలినిండుగ నంత బొచ్చున్నయట్టి
జంతువునకును దేనికిఁ జలి ఘటిల్లు
వైష్ణవుఁడు గొఱ్ఱెయును గానివారలకును.

రయిలులోఁ గూరుచున్నట్టి రమణియొక్క
కోఁతివలె నున్న యేఁడాదికొడుకుమీఁద
దాను శిశువులపైని వాత్సల్య మెంత
నెఱపవచ్చునో యంతయు నెఱపె నతఁడు.

క్రొత్తపెండ్లము మగఁడైన కొడుకు తనదు
తల్లిఁ బొరుగమ్మఁ దోడిచ్చి తనకు జీత
మల్ప మైనను శ్రీశైలయాత్ర కనిపె
ముద్దుకోడ లందిచ్చిన మాటతోడ.

మేడమీద నామె మేడక్రింద సతండు
వేసినట్లు చేద తీసినట్లు
దృష్టిగములె కాస ధృతి: నేటవాలైన
మేడమెట్లు నెక్కలే డతండు.

నాలుగుపుట్లుం బండఁగ
నాలుగుకుంచాలు విత్తనము చల్లుదురో
శోకక! యీ చదు వేమిటి
కూలి మిగిలి నాము వేసికొనిపోవుఁజుమీ!

రంభవలె నున్న దసి సంబరమ్మునపడియె
దాను పెండ్లము గని, కాపురాని కామె
వచ్చుచును దోడఁ గొనవచ్చె బసినవశేరుస
చీలిజగడాల చిల్లికజ్జాలవాని.

అందమైన భార్య యైనట్టి, పల్లియఁ
బెరిగి చదువుకోని పేదవాఁడ
నాగరులను చదివినా రసి చుట్టాల
నిల్లుగాని పట్టనీయఁ బోను.

ముక్కు లింతగాఁగఁ బొడుచుక వచ్చెను
చనులు గలిగినట్టి మనుమరాలు!
పాలుతీయ నిప్పు సరుగ త్తకే సేసె
పడ్డ కల్ల సిసుఁ బడదు సుంత.

పొరియ్యా. మండించుటకునయి పొలతి యంత
కష్టపడి యూఁద నేలనే కా దటంచుఁ
గెలనఁదిరిగి కూర్చుండు మాఁ కేకథముల
కులికిపడి వహ్నిజ్వాలలై యురుకఁ జేసె.

తొడిమసట్టు మెల్లఁ దొలఁగి తప్పించుక
పండు నేల రాలిపడిన యంత
పూతశాఖ చివురుజొంపమ్ము మొగముతోఁ
పంపుసంక నల్లె వంగి చూచు.

ఇది యంత్రయుగ మటంచుం
బదింబది వచింప నేల పండితుఁడా! నీ
పదనగు వాగ్ధోరణి యీ
కదలెడు గతి నాకు నమ్మకము పుట్టించున్.

పండితులె యెల్లవాసు 'కాంతి' యనుచు
నడుగ నొక్కఁడు చెప్పలేఁడనిరొ నతఁడు
మఱియు సందర్భ మే మన, 'మనుచరిత్ర'
లోని దనియె 'మాయాద్వార' పైని మాట.

అవు నవుఁ జటారుకమ్మ నున్నట్టి పూవు
లాఁమొ కందవు, పూజకై యందములోనఁ
దమరు మఱి కోసి పెట్టినఁ దప్పు కాదు
కాంత సిగ్గునఁ గొను టింతకన్నఁ గాదు.

ఓయి కుంటిగోవ! యా యూరికే మమ్మ
నడిగె దీవు కుశల మున్న యెడల
గుజ్జు మావివారి కోడలు కుశలమ్మ
వారి యింటిలోఁ దుపాకితోడ.

అసలు త్రోవ యిట్లుండఁగా నల్ల నైన
గిరికిఁ బైనఁ జుట్టంతయుఁ దిరిగివచ్చెఁ
జివరి కొరిగిన దేమైనఁ జిన్న మెత్తు
కలదె! ఆ కొండ విడలించెఁ గాలుత్రాళ్ళ.

తాటి మొవ్వమీఁదఁ దా వచ్చి మఱి కొంత
సేపు నిలచె నిరుటి చిన్న మొయిలు
తోటఁ గ్రొత్తమొగ్గ తొడిగిన కడిమికొ
మునందు గగురు గగురు తోఁచె.

రబ్బరుబంతులె యైనను
నబ్బో ముట్టుకొన నీయఁ డా నటకుఁ డటుల్
డబ్బిచ్చి తాఁకు చుందురు
కొబ్బరి పాల్ద్రావినట్లు ఖోజ్జారసికుల్.

నీ యక్కసు తీరినదా
నీ యారాటంబు తుదకు నిలచినదా! అ
బ్బో! యెంత తిరిగినావే
కాయజునకుఁ గంపబడ్డ కాకివిధానన్.

నన్నుంచుకొనిన వానికిఁ
గన్నుంగప్పుటయు నంతకష్టము కాదే
నిన్నువిడచి యెవ రెవ్వరొ
నన్నడిగి రటంచుఁ జెప్పినం జాలు సఖా!

కదలక యట్లే చూచును
అదిరా! ప్రతిరోజు, నదియ యనుకొంటిని నే
నది యింత పలుకరించితిఁ
దుది కీ గతిఁ బోయి యన్నతోడం జెప్పెన్.

అతని పెండ్లమునగపోయె, అరుగుమీఁది
కుట్టుపనివాఁడు దొంగగాఁ బట్టువడియె
గుట్టుచప్పుడు కాకుండఁ గూరుచుండి
రెంత మర్యాదగలవారొ! యీవె చూడు.

ఊరక బిగించుకొని కూరుచున్న పతిని
తాఁకఁబోవఁగఁ దాఁకవద్దని యతండు
నోలి "ధూబాడ్డు మాలు" జిల్లాలు పెట్టఁ
దెరవ బలవంతముగ విడఁదీసె వ్రేళ్ళు.

చెఱిగిన తిలకము దిద్దెను
శిరోజములు దువ్వుకొనియెఁ జీరను దాల్చెన్
సరిచేసి ముడతలను నె
వ్వారు గుర్తిడఁ గలరు దాని భావజకేళిన్.

నీవు వేసినకడవయు నేను వేసి
నట్టికడవయు బావిలో నడుగునీటి
మట్టమునఁ దాఁకి కిలకిలా మధురహాస
మాచరించుచు నున్నవే యంబుజాక్షి.

కొంటె పదిమందిలో భార్యకొంగులాఁగ
లీల, సిగ్గరి, సతి, విదలించి, 'బామ్మ!
చూడవే' యన నా వృద్ధ, సుద్దిలేని
దిప్పకాయ యటంచును దీర్పు చెప్పె.

రైలులోఁ గూరుచున్నట్టి యాలుమగల
యెంతో యన్యోన్య మైనట్టి హేలఁగాంచి
కూడిన జనంబు వాపిరిగొట్టుతనము
బెదరఁగొట్టెను చూపుల నదరుచేత.

ఓసి కీర్తి! నీకు నొక వేయిమొక్కులు
లజ్జవిడచినఁ గులంబుకొలఁది
వర్ణభేద నిందఁ బైపైని రచనల
వచ్చునీవు నాకు వలదు వలదు.

క్రొత్తపెండ్లముఁ గొట్టెలోఁ గూరుచుండఁ
బెట్టి కూర్చుండి పతి వెనక్క శట్టునందు
నేఁగుచుండఁగ బండికి నెదురువచ్చు
దొరను గని యామె సిగ్గులబరణి యయ్యె.

బండిపై గడ్డిబొద్దు నాపైని భార్య
బండికాడిపై దాను కూర్చుండి కోరుక్క-
లూరఁ జనునట్టి చిన్నిపాతే రోకందు
అర్జునుండు సుభద్రాపహరణవేళ.

దానికిఁ జాతిక మందియు
మానుగ నా కొక్క వందమందియు బిడ్డల్
మేనత్తకూఁతు రైనను
దా నేటికొ యింక నాకుఁ దగసిగ్గుపడఁగ.

ఓసి వెలఁది! నీవు నుత్సవంబునకును
నేఁగ నాకు నిష్ట మింతలేదు
ఉత్సవంబుఁజూడ నొక్కఁడు రా డందు
మిమ్ముఁ జూచుటకునె క్రమ్ము చంద్రు.

ముసలిభర్త తాను ప్రొద్దుటఁ బ్రొద్దుట
నిత్యమల్లియందు నీళ్ళుపోయఁ
బడుచుభార్య ప్రొద్దువాలు సంజలయందు
మల్లిమొక్క మొదట నీళ్ళు చల్లు.

మఱియుఁ గోటప్పకొండయు మంగళగిరి
మొదలు నిన్ని పుణ్యక్షేత్రములను నిన్ని
యిన్ని తిరునాళ్ళు జరుగ నీ వేమొ యత్న
సుఖ మెఱుఁగ నంట నిజముగాఁ జోద్య మతివ.

అతఁడు మంచిమనిసి యౌనో కాదో చెప్ప
వాని నడుగలేదు నేను బోయి
అతడు తాను చేసె నడుగక యుపకార
మచట నచటఁ జెప్పు నడిగితి నను.

ఎప్పుడు నెవ్వరో కొందఱు
గొప్పకవిని తెలిసి మెచ్చుకో రని దిగులా!
అప్పరమేశ్వరు లేడని
చెప్పు ప్రభువు లున్నయట్టి క్షితితలమందుఁ.

దేవుఁడు పుణ్యము పాపము
భావిత కర్మఫలమాది పాటింపని, నీ
తో వాదించుటకును మఱి
నీవలె నాస్తికుఁడ నగుట నేనును వలయుఁ.

జీవితములోన తా నొక్కచేడె మిగిలి
పారవోసట్టి యొక్కొక్క ప్రకృతి కేమొ
పరమదురదృష్ట మే మన వాఁడు మొదటఁ
గలసికొన్నట్టి సతి మాలకాకి యగుట.

విఱచుకొనుదొమ్ము పెండ్లము వెనుకఁ బోవు
డప్పు బుజమున పడి గూనుగొప్పిగాడు
మదనుని గజోత్సవముముందుఁ గదలిపోవ
వెనుక నాబత్తుతో లొట్టిపిట్టవోలె.

బోగముది పెండ్లియాడిన పొరుగు మాది
యయ్యవారో యామె వచ్చిన దాదిగాఁగ
మఱి పతివ్రతా మహితధర్మముల పుణ్య
పాపముల యుపన్యాసముల్ పట్టరావు.

ఆమెతోఁ జెప్పినవి యీమె యామెతోడ
నీమెతోఁ జెప్పినవి యామె యీమెతోడ
సవతు లిద్దఱు మఱి పరస్పరము చెప్పి
కొని పతిఁ గ్రాఁగఁదీసిరి కొసకు రేల.

తెలియఁ బై యధికారి తప్పులను లెక్క-
లేదు వానికి నొకశిక్ష లేదు మఱల
చిన్న జీతమ్మువాఁడు చేసినది దోష
మవునొ కాదొ యుద్యోగ రామార్పణంబు.

శతమఖుడు గౌతముని భార్య కతుకుఁబొంది
పుట్టుమచ్చలను చిఱుతపులియ యయ్యె
పిన్నమామ మేదరవారిపిల్ల నలికి
నలుపుచారలతోఁ బెద్దపులియ యయ్యె.

పేదసంసార మిద్దఱు పెండ్లములును
కుమిలిచి కుదించి కూలిచి కుప్పవెట్టె
క్రమము విడి వెంట వెంటఁ జక్రమ్ము లెత్తు
పల్లముల లాగు రెండెడ్లబండివోలె.

సన్న తెలిచీర తాలిచి స్నాన మాడు
పడఁతి! నీ యంద మంతయు బట్టబయలు
సిగ్గుపడి చెర్వులోఁ గంఠసీమదాఁక
మునుఁగు నీ కనుల్ కలువల మొట్టమొదలు.

సమరస మృదువుల సతిసిత
కమలాపాంగములఁబోలు గద్యము పద్యం
బమృతరస వ్యంజక శా
ట్యమనోహార్యప్సరో దృగంతముఁబోలున్.

చిత్తమును నిల్పుకొనలేక చిలుముపట్టి
తైలుటిక్కెట్టు లేని బైరాగి యయ్యె
మదికి నిర్దుష్టభాష నమర్పలేక
యభ్యుదయమార్గ మూని హాస్యకవి యయ్యె.

అతఁ డెదో హాస్యరసవేత్త యంచుఁ జెప్ప
నాయె టిక్కెట్టుకొని చూడఁబోయినాను
పోయి వాని వికారపుమొగము వాఁడు
వానిఁజూచుటకే నవ్వవలసివచ్చె.

మగువ నల్లనికాంతి మైమఱువు తోఁప
వచ్చి శివరాత్రికిని బ్రాఁతపగనుతీర్ప
చెఱకుగడ కొని బుజమునఁ జేర్చికొంచు
తిరిగి మదనునివలెఁ బోరి కరుగుదెంచె.

ఓరి! మామ నీ కూఁతున కురక యేల
పరికిణీ, రైక కుట్టింపవచ్చు బదులు
ముందు పరికిణీ తన కరంబులకుఁ జుట్టి
కొంత కొంత బొమ్మనఁ గప్పుకొనెడు చూడు.

నాన్న! రాజుగారికిని నెన్నండుగాని
కోప మింతైన రా దిది గొప్పగాదె
గొప్ప కా కేమి? రాజునుగూర్చిగాని
చిన్న మెత్తైనను విమర్శ చేయరాదు.

తోలినాళులఁ బద్యారము
తెలియనిచోఁ బ్రాకునిది తెలియుఁమి, యీ నా
ళుల వ్రాసినకవి దోషము
కలి ముదిరినకొలఁది చిత్రగతులను నడచున్.

తెగ బలిసి బిర్ర బిగిసిన
దగు లాగూ తొడిగి నడుమునంతకుఁ గోటుం
దగఁ జను, దెలుఁగు దొరా? గుడి
పొగిలి విడిన కాలభైరవుండో కనుమా!

ముద్దుకొనఁగ నీదు ముట్టుకోనీయదు
తొలఁగి పండుకొనియె దూరముగను
పలుకఁ గసరికొట్టు, పయ్యెదకొంగుతో
బలికి విసరు నేలొ పద్మగంధి.

తల్లిపాలు చాలనియట్టి పిల్లలకును
ఈ బజా రెల్లఁ బోయి పాలిచ్చు నామె
ఆమె వక్షస్స్తనంబులు సింహాద్రికొండ
సురనది స్రవించు శివజటాజూటి రయ్యా.

వాఁడు ననుఁ జూచి కనుల జిల్లేడుపాలు
పొడుచుకొను నేలో?_ కన్నులు నుడుకు చేసి
రెండుధారలు చనుబాలు పిండు మన్న
నసిగితివి గాని మఱి పిండినావె చెలియ!

క్రొత్తగా గ్రుడ్లుపెట్టిన గూటిమీఁద
కందిగింజలవలె నుబ్బు కనులతోడ
కదలిపోవదు తొండ డొక్కలును దించు
కొంచుఁ బోయిన నైన నాఁకొన్న కతన.

ఉవిద కోక్కపురుషుఁ డున్నతోద్యోగాఁ
కోక్కపురుషు డిద్ద జోక్కతీరు
చేడె పదవి రెండు చెడిపోవకుండంగ
పాడుకొనెలాయుఁ బైని పోగరు.

ఏ మేమో యిద్ది ప్రజా
స్వామిక మట ధనము పలుకుబడియుఁ రెండుఁ
సామర్థ్యంబును జంపెడు
నా మహనీయ మగు శక్తి కంతసి లేదే.

కడుపు లేదును మరి వల్ల కాడు లేదు
అతివ తా నోకిలింతల నభినయించు
ఉంచు కున్నట్టివా డిచ్చె నొక్క యింత
డబ్బు, డబ్బుకు కొడుకు పుట్టడు గదయ్యా.

కావ్యములలోన వర్ణిత కచకుచములఁ
జూచి యా ప్రభు వేవగించుకొనెఁ బూర్వ
కవులపైఁ గోపమునఁ దల్లి యువిద కూఁతు
కోడలుల రూపమైన జేకోదు మదిసి.

మాఘ ఫాల్గుణముల మాగానిపొలముల
గడ్డికడెము లొలిగాఁగ నెసఁగె
ముసలి సస్యలక్ష్మి ముంగురుల్ గిరికొను
పసిమిదైన ఫాలభాగమట్లు.

ప్రేమలేద యిద్దఱికి నగ్నిసాక్షిగా
నైన పెండ్లియందు నాదరమున
గంగ యమునవోలెఁ గలసియేపోదురు
గంగ యమునవోలెఁ గలసిపోరు.

వెస స్వరాజ్యము వచ్చినపిదపఁ గూడ
సాఁగి యింగ్లీషు చదువునే చదువునట్లు
అంగనామణిని పెండిలి [illegible]కొనెద
ప్రాఁతమట్టరికమునె [illegible]

రైలులోన మొగము త్రావుచు నున్నారు
కొంతమంది యెదుటఁ గూరుచుండి
పిల్లవాఁడు పోసు పెట్టుచు నున్నాఁడు
బొమ్మ త్రావనీదు శ్రోణిచక్ర.

ధాత్రి మతముపేర నెత్తుటేఱులు పారె
నంచుఁ గోప మూను నతఁడు తగవె!
ధాత్రియందు నెన్నొ తడిగుడ్డ లుండఁగా
గొంతు కత్తితోడఁ గోయు టేలొ?

అల్ల రాజుగారి యాస్థాన పండితుం
డసన నెల్లకవులు నణఁగి యుండు
రొక్క విషయమందు నొకచర్చకును రాఁడు
నలుగు రున్నచోట నిలువ డసలు.

ఆశ్రయింపన్న దేవత కతఁడు భక్తుఁ
డనయ మా దేవి పండినయదియ పంట
ముగురుతల్లులకును నామె మొదలివెలుఁగు
నలువరాణికి నాయమ వలస బీడు.

కాని విన్నావురా! మనవాసి కార్య
మైనరాతిరి మన్మథుం డైనమాత్రి
మసలు రాలేద చెప్పుడో యరుగుదెంచి
విడిచివచ్చెన చెచ్చటో విల్లు నమ్ము.

ఎవరికో వార లుద్యోగ మీయ నెంచి
భాసురంబుగఁ బ్రకటనచేసినారు
"ఫీజు" పదునేను రూకలు; పీఁడకూడఁ
దనకుఁ దినఁదిండి లేదు చందా నొసంగె.

అంత పెరిగియును సమర్థయాడదంచు
భర్తయింటికిఁ బంపిరి పదుచుకత్తె
చోటు మార్చిన లేగున్న చూతమట్లు
లేమ రెండేండ్లలోన ఫలించెఁ జూడు.

ఎన్నొచిక్కులు పాసిపోయినవి తండ్రి
కతసిచదువును బెండ్లియు నన్ని కొడుకె
చూచుకొనె, వేనినో నీటిచుక్క తనకు
వదలఁగాఁ దండ్రి చూచుకోవలసెఁగాని.

తిండి లేకస్తు పిస్తైన తెలుఁగునాట
నంతలో నిరుద్యోగ సమస్య తీరె
దాడిలేని ఏ. ఆర్. పీ.యు తాళి లేసి
చలనచిత్ర సరస్వతీసతియు వచ్చె.

మగనిచాటు అంపమాఁసిరిగా నుండె
వాసిదైన వాదవైభవంబు
కా దనంగ రాజుగారికిఁ గోపంబు
అవు ననంగ దేశ మంటుకొనెడు.

ఆవి తేరెడుఁ బాశ్చాత్త్యభావములను
విలుచు చున్నారు మన తెల్గుపేరు పెట్టి
"ఒక్కటే ధర" అంటించి యుండెఁ జూడు
చిత్ర చిత్రవస్తువుల ఫ్యాన్సీబజారు.

యుద్ధములు కల్గుదేశాల నొక్కపురుషుఁ
డెందఱో భార్యలుగఁ జట్టు మోసెఁ మొసఁగ
యుద్ధములు లేని దేశాల నొక్కపురుషుఁ
డొక్కభార్యయుగాఁ బట్టి మొందవలె లోలుఁడు.

జీవుఁడును సుఖదుఃఖముల్ చిత్తవృత్తు
లైహికాముష్మికమ్ము లివన్ని పోయి
యంధమనుజులు యుద్ధాగ్ని కింధనములు
గాఁగఁ బలుదేశముల సృష్టి సాఁగుచుండె.

భుక్తి లేక దారపుత్రుల వధియించి
యింకఁ దాను చావ నెంచుచుండ
రాజభటులు కరుణ రక్షించి చెరలోనఁ
బెట్టి యింత తిండి పెట్టినారు.

ఎప్పుడో రెండు మాసాల కేఁగుదేరు
నల వసంతుఁ డటంచుఁ దా నాఁగఁ గలదె
మాఘమాసాదిఁ బూచిన మావిగున్న
నాకుమఱుఁగున వెలితేంట్లు లనుభవించె.

మూఁడునాలుఁగేండ్లు పాలివోసి శౌర్యానఁ
బోరులందుఁ దనదు పేరు నిలుప
మదిని మెచ్చినట్టి మదనమహీపతి
లేమ పిఱుఁదుఁ గుండలీకరించె.

ఎంత ప్రియ మయిపోయెనో యెఱుఁగరాద
యెప్పుడో యుద్ధ మనినంత నిప్పు డపుడె
అంగజాతుని యింజనీరింగు పాపు
ప్రసవవనిలోనఁ జివురాకురాయి మొదలు.

పొలతు లాధారపడియుండ్రు పురుషులపయి
నాస్తి కలిగిన కాలములయందుఁ జూడఁ
బురుషు లాధారపడియుండ్రు పొలతులపయి
నాస్తి లేనట్టి కాలములయందుఁ జూడ.

బావ యెంతయుఁ గాకర పాదువంటి
వాఁడు వేసంగిలోఁగూడ వేఁడినీళ్ళు
కావలయు మేనఁ దోఁచిన గగురు గగురు
బెత్తికలువోసి సిరి ఫలోత్పత్తి కనుము.

కాలేజిప్రక్క వారి
ల్లా లేమకు వేళ యెంతయైనం గడచుఁ,
బాలు రుపాధ్యాయులు నే
వేళకు నెవ రెవరు వచ్చి వెళ్ళెదరో కనఁ.

అతని యనుభవంబు నది యొక్కటే తీరు
కావ్యమందు నంటి కాంతయందు
పరులు చెప్పినట్టి భావమ్ములే కాని
అతని సొంతభావ మనుచు లేదు.

పెద్దరాణి కాసావారి ముద్దియలకు
నందఱికిఁ జెప్పి మఱి వివాహములుచేసె
మఱియు నందఱిపెండ్లిండ్లు మాపుచేసి
మున్నుగల వృత్తిలో దించెఁ జిన్నరాణి.

పూర్వమున సంఘసంస్కారమూర్తి వార
కాంతలకుఁగూడఁ బెండ్లిండ్లు కావలె ననె
నేఁటి సంఘ సంస్కారపండితుఁడు మఱియు
మఱి కులస్త్రీలకే పెండ్లి మానిపించు.

జాతి పతిత వర్ణములు కావు జంతుభేద
మైనఁ గల్పితమే యని యట్లు చెప్పి
గోటలోఁ బీటవెట్టిన కొండముచ్చు
స్త్రీజనంబు నా[illegible] జేసెను.

మంచి యుద్యోగి తన మేనమామ కొడుకు
తన నెలలపిల్లవానిఁ జూపను లతాంగి
మొదపయిన నుండియే యందియిచ్చుచుండ
కంచుకము పాల తడిచేసెఁ గాయజుండు.

పైసా చేపడ టంచును
ఆస విడిచి కోపమంది యది గర్వముగా
భాసింపఁగ "నంత సునా
యాసముగా రా" మ టంచు నవె నొకతీరై.

వీధినాటకమున వెనుకఁ గూర్చుండిన
వారు గోల లేపి పా మటంచు
ముందు చేరినట్లు కొందఱు వర్ణభే
దమ్ము లాడి జీవితము గడింతురి.

మొదటిసారి పులుకు పులుకునఁ జూచెను
నెలలు కొన్ని గడువ నిలచి చూచె
మఱల నెపుడొ నవ్వొ, మఱి చూడనేలేద
లేమ సుంత చొరవ లేనివాని.

మలుగులందునఁ దొలఁగించుమాద్రిగాఁగ
కేవలమ్ము కుంటించి డేకించుచుండె
నా బజారునఁ జివరి గేహంబుకాడ
గోడిబిళ్ళాడు చున్నాడు కుసుమశరుఁడు.

ఎంత డబ్బైన నిచ్చున యింటిలోని
చిన్నవస్తువు త్యాగము చేయలేడు
వాఁడు; వీనికి మదిలేదు వర్ణభేద
ముల్ల మునను శాఖాభేద ముజ్జ్వలంబు.

కలసి భోజనంబు కావించునంతలో
వాఁడు వీఁడు వీఁడు వాఁడు నైరి
వచ్చి యింతలోన వ్యవహార మందుకో
వాఁడు వాఁడె వీఁడు వీఁడె యైరి.

వాని కేమి మహారాజు వానిభార్య
సకలవిధములఁ బోషణ సలుపుచుండె
అతఁడు రే లెల్ల నా వీధియరుగుమీఁద
నిజము సుఖముగా నారీతి నిదురపోవు.

తోటతుది నున్న కోకిల
పాటను విని యాంగ్లభావ పండితసఖుఁ డ
ప్పాటఁ భారత దేశపు
నైటింగే లన్న బిరుదు నాటం బలికెన్.

కాంత, తనకును "కంపెనీ" కా దటంచు
కంపెనీకాంతఁ దెచ్చె నొక్కండు పోయి
సవతిని నెఱింగి తెల్లనిసతియు నల్ల
మొగము నల్లనిసతి తెల్లమొగము వేయ.

దున్నఁబోయిన నక్కటా దూడలందు
నేమయిన మేయబోయిన నెడ్లయందు
క్షత్రియులు వైశ్యు లరయ ద్విజాతివారు
బ్రాహ్మణేతరు లుద్యోగఫక్కియందు.

పొలతి, పొరుగూరు చనినట్టి పురుషుఁడల్ల
వీధివాకిలిలోనఁ గన్పించినంత
ఏదొ పని యున్నయట్లుగా నేఁగి చిన్న
దొడ్డి నారింజమొక్కలకైఁ దూలిపడియె.

వారి దొడ్డిలో నిలఁబడఁ బ్రక్కవారి
మేడపైకి నద్దములోని నీడయల్లె
బావికాడికి నా దొడ్డివారి బాల
యును మఱిందంబు చేసికోకుండఁబోదు.

వారియింటికి నల రెండుప్రక్కలందుఁ
గలవు బ్రాహ్మణసంసారములును రెండు
పెండ్లికాని కూఁతుసమర్త వీరి కబ్రి
మబ్ర మచ్చోట వారి సంధ్యాదిజపము.

ప్రబలమేఘాలు పట్టెఁ దుపానుకొట్టె
నల విశాఖపురీ సముద్రాంతవీధి
నొడ్డు కెరటాలు తెలినెమళ్ళో యనంగ
నురికె మైసూరు తెలిగిత్తలో యనంగ.

ఒగిని రాచరికపుటుద్యోగ మున్నచో
కానరాదు తిండిలేని లోటు
డొక్క బలిసి యుండు "శేషసింగు" మహాత్ము
బలకరమ్ము తిండి కొలిచి తినుట.

రంగు బొమ్మలఁ దాఁగుట ఛాతిబొమ్మ
లను స్పృశించుటకంటెను లక్షు నయము
"క్లోరొఫారము" నందున్న కోమలాంగిఁ
దాఁకె డాక్టరు మిట్టమధ్యాహ్న బుద్ధి.

చేతఁ జిఱుతలు పూని పూచెండ్లు తలకుఁ
జుట్టి కాళ్ళకు గజ్జెలు కట్టి కావి
చీర రైకలయుఁ దాల్చి క్రొంజివురు సూర వ
జీరు, వారింటి హరికథల్ చెప్పఁదొడఁగె.

ఒకని కిద్దఱు పుత్త్రికలుండి రేని
వేనిభాగ్యమ్ము నిజముగా వానిదేను
విష్ణుసుతులలో గుడిలేను పెద్దవాని
కంగజుఁడు కొనె నెన్నిపాడైన గుళ్ళు.

ఎంద తైన దంతు రెంతో యెంతో యూఁళ
మనిసి కైన రాదు మానె డైన
ఈవు దంచు చుండ నెన్నిసంసారాలు
పుట్టి పుట్టిమునిగి పోవు చుండె.

ఇతనిచే నెల్లపనులు చేయించు నామె
యేల చేయించ దామె వీఁ డేల చేయఁ
డితనికిం గోర్కె కల దంచు నింతి యెఱుఁగు
నితఁడు వయసు మళ్ళినవాఁడు నింతిపడుచు.

మొదటిభార్య చచ్చిపోయిన దని వాఁడు
పొగులఁ బొగులఁ జచ్చిపోవు నంచు
భయము తోఁచె నాఁడు, పడతి రెండవయామె
వచ్చె నీమె యనినఁ జచ్చిపోవు.

బిగిసికట్టి గౌను దిగవేసికొని యేఁగు
బదియు నాలుఁగేండ్ల బాల బడికి
కుమిలి గాలిలేక గుప్పిళ్ళుపట్టుక
బ్రదుకు నేమొ యచట భావజుండు.

చెలువ మెల్ల స్వచ్ఛ చీరెలో నొడ్డభోసి
యెదురుగాలి త్రోవఁ గదలెఁ బడుచు
కోమలాంగి గాలి గుంజీలు తీయించు
కుచ్చెలలును బైటఁ గ్రుమ్ముకొనఁగ.

ఒకరిమీఁద ద్వేషమ్ము లే దొకరిమీఁద
ప్రేమయునుగల్గదు చమత్కరించును కవి
తనకు దెబ్బయుఁ దగుల నందఱను గూడి
తానుకూడ నవ్వుట సముద్రాలలోఁతు.

పెండ్లిపీటలపయిననే పెద్దపదవి
నున్న నవభర్తతోఁ గూరుచుండి పడఁతి
జిలుగుకంఠంబుతోడ నాశీర్వదించు
కవిసమాధుల్తోఁ జూపులు కలిపె నింత.

కూఁతురు సంపాదించిన
దా తీరునఁ దినక కొంతయైనను దాచం
గూఁతునకు మగఁడు దొరకును
నీతికిఁ జెడ్డి డబ్బులేక నెగడునె మగఁడుఁ.

దొరపొగాకు పెద్దతోట వేసెను వాఁడు
తిండి లేక గడ్డి తినఁగవలసె
వాఁడు తినకముందుఁ బైవాండ్రు తిన్నారు
పై డినగలభార్య పస్తు లుండ.

మొన్నటిదాఁకను భార్య య
టన్నను కఱినలుపు నాకు నకట—ఱాలే దం
చన్నతఁడు లంకెవిడిపో
'డెన్నడు మదనుసిరహాస్య మెయ్యది కలదో.

చెప్పులోఁ గాలుపెట్టి సిల్చెదవు స్వామి!
కదలిపొమ్మ్నట్లు నమ్మించగలను నిన్ను
వేగఁ జెప్పెడుమాటలు వినడ యేని
జగతిలో గొప్పవాఁ డెట్టు లగును చెపుమ!

అంత చిట్లని సమపాళమైన కాపు
నదరుగల పూజ. వెలయుఁ గుండలును చూపఁ
రంయి మని చుట్లుతిరుగు చక్రంబుసొగసు
పడుచు దెలియదె కుమ్మరివారిపిల్ల.

ఈ తెనుఁగుసినీమాలకు
భ్రాంతిగఁ గొనిపోకు పిల్లవానిని వీఁడుఁ
బూతులను నేర్చుకొనియెను
చేతోమర్యాదలేని చీదరమాటల్.

మఱి సతీతిలక మ్మాదిమాట లెల్ల
గ్రంథములయందు నీ వింతఁ గట్టిపెట్టు
అయ్యో! మంత్రులు కాఁబోవునట్టివారు
స్కూళ్ళలో బొట్లహో పెట్టుకొనుట లేదు.

తిండి లేనట్టి పేదకుఁ దిండి కలుగు
రాజ్యపతులకు టీ. బీ. శరణ్య మయ్యె
మందులేనిది యీ వ్యాధి మందు లకట
కొనుటకే కొంపయంతయు గుల్ల యయ్యె.

వలపు గుప్పు మన్న తొలిదినంబులయందు
పశువు కొంత నయము వాఁడు వలసె
వాడి వత్తు లయిన మోదురోజులయందు
వేల్పువంటివాఁడు వీఁడు వలసె.

పరికింప దూరమునకును
సురియవలెఁ జేవ వెదురుచువ్వవలెఁ సుం
దరముగఁ గన్పడి మఱి ముం
దరికింజని చూడ గోతి నయ మనిపించెన్.

పేడ చేయుచున్న వెలఁది! విశ్వామిత్రి
మునికి నీదు భర్త ఋణపడియెనొ
నీదు భర్తలైన జూదమం దోడిరో
అతఁడుగాని కలిసమాశ్రితుండొ!

వినుము మనోవాక్కాయము
లని మూఁడు తెరంగు లంచు నది తెలియక యా
డెను సావిత్రి యసలు దుం
డెను "దస్కతు" దానిపేరు నెటి నాల్గవదై.

కొడుకు చనిపోయి పాపము కుమిలి కుమిలి
కర్మచేసెడుఁ దండ్రి దుఃఖమున మునుఁగ
మసన మందె మనోవర్తిమాట నెత్తె
మంకుపట్టు వియ్యంకుఁడు మంటిపురువు.

అన్ని జిల్లాలలోపల నున్న సరకు
విలిచి కంట్రోలు పుట్టించు వీరశెట్టి
బాగుగనె యుండె నొక పది బారువుల క
డంక వీసికిఁ బుట్టెఁ జక్రాంకితంబు.

ఉరుకు లాడుచు వ్రేపల్లెనుండి వచ్చి
వడ్లు దంపుచు నుండె నీ పద్మనేత్ర
మున్ను రైక నెత్తుక చన్న చిన్నికృష్ణుఁ
డామెబొమ్మన నిపుడు ముత్యాలు పోసె.

తా నింత ప్రియము పడదేఁ
చాన మొగము త్రిప్పుకొన్నఁ జాలు గోఁబడు నే
దో సింద ముడిచి కన్నొప్పు
సూనరి రాడీల వెలిరుచుల్ ఘురగిసదో.

ప్రాతవడ్డ సరంజామ బాకు విల్లు
నగుఁ డార్జించెఁ జంటఫిరంగు లాది
చట్టుబండలై లక్షణశాస్త్ర మార్గ
మార్చి మిలిటరీ డిక్టేట రయ్యె మరుడు.

పరిశోధన కాలములో
సరయంగాఁ గవితయంద మది యెఱుఁగుదురే
తరుణి నవహేల తెలియదు
శరీరమునను త్యాగస్పృగ్వసా జ్ఞానముచే.

భార్యయందున శాంతితోఁ బడయుసుఖము
కామదహనాగ్నిఁ గను జారకాంతయందు
పరమశాంతి స్వదేశ భావములయందు
నల విజాతీయములతోడఁ గలక బ్రదుకు.

ఫలభరిత మంచు మాకందపాదపంబు
నాశ్రయించిన మల్లీలతాంగి చూడు
చివురు గన్నులతోఁ గటాక్షించె మావి
నంగనాజన ప్రకృతిరహస్య మిద్ది.

అవున యోసీ బాలమ! అయ్యయ్యొ అంతంత
నెత్తెత్తేల పడితి నీవుగాని
ప్రాణమిత్రుఁ డట్టు లరుగుదెంచి తడియార్చి
కృత్రిమముం జెవ్వఁడు పగిలెన్న విప్పు.

మొదటిసారి ప్రియుడు ముద్దిడుకొన్నంత
కన్నె బెదరి క్రొత్త కాల్వక్రింద
సాఁగుపాలుము దంష్ట్రనాగ్రలి త్రాఁగిన
పెళ్ళ తిరిగినట్లు తెల్లవోరాలె.

చిన్నిపూవు కన్నఁ జివురాకు మెత్తన
దాని కన్న పిల్లదాని తలఁపు
తలపుకంటెఁగూడఁ దొలియీఁత మావెన్నఁ
పెట్టినట్టి దివ్వె పిల్లవలపు.

సారిది భారతమును వ్రాయ సోమయాజి
యగ్నిహోత్రాలు చేసినాఁ డనుట నిజమె
అగ్నిహోత్రాలు లేకుండ నక్షరంబు
సాఁగదేకద నేఁటి మా సత్కవులకు.

కాలకేయులు తెరలపైఁ గానిపింప
లచ్చికొడుకుల యాజ్ఞాబలంబువలనఁ
జతురుఁడై సినిమా కుంభసంభవుండు
తాపిగాఁ దీర్చికొని సముద్రాలు త్రావు.

తా నుషఃకాంతి, తెలవారుతరుణమందు
పొన్న తామరపూవులోఁ బుప్పొడివలె
విరిసినది యంచరెక్కల విప్పుతుదల
పైడికాంతులు తుదలందుఁ బ్రబ్బినటులు.

అమెరికా దేశమందున నంగజుండు
లావుపెదిమలు బొగ్గు నల్లనగు మేను
అచ్చరలు వానియందాని కభిసరింతురు
అతని కశివదృగ్వహ్ని దాహములు వేలు.

పరమ సుకుమార! మా యూరి చెఱువునీళ్ళు
మురికి యంచును బెదరంగఁబోకు పోకు
చివురు సంజలయందు దక్షిణపు గాలి
అచ్చరల యుత్తరుల కొంగు లంటివచ్చు.

అవ్వను తన దేమిపోయిన దంత రెడ్డి
బిడ్డ చనుదెంచి మూర్ఖులు వేయు మసిన
వేయ రా దేమి? వాఁ డేమి విజయి తనకుఁ
గడకుఁ జెడియెఁ బరీక్షాధికారిపదవి.

నిజమును బరాచికములోన నిహ్నవింపు
సరసహృదయుండు కోపము చాయఁబోఁడు
నవ్వు లేదు కోపము లేదు నగ్నమతికి
నూలుకొన నద్దియె, తొలి మనుష్యజన్మ.

రమణి! నే నంత సామంతురాల కాను
ఇల్లువదలి రా నాసాక్కర మింత లేదు
దాసదుంప తెగిరిలే జగాన నెల్ల
వనితలును నందగాండ్రకే భార్య లైరె.

దున్న బోయితి వేసియు దూడలందు
మేయఁ బోయిన నెడ్లలో నొలఁత మగఁడు
సుంత యెప్పుడైన "జాలెండు షోసు"కొ అను
చిన్ని పెండ్లముకడఁ దమాసీలుదారు.

మైనలుపు కాదు పచ్చనిమనిసి యామె
లచ్చికలిగినఁ గాఁడాయె లచ్చికొడుకు
చిత్రములు ముళ్ళుపెట్టుట చేతఁగాదు
మగువ యెఱుఁగదా! భర్త మన్మథుఁడుకామి.

ఏనుఁగును జూడలేదని స్థానుఁ డనియొ
ననియొ జనమందు చీట్లపేకాడుచుండి
వానిబదులుగ మోటార్లువచ్చె నందుఁ
శతవిధంబుల నల్లనిజంతు వచ్చు.

నీకుఁ దెలియ దుద్యోగము నిల్పుకొమ్ము
కదలి పొమ్మనినను సాహుకారు రైతు
గడన యుద్యోగి "ఫోర్జింగు" కేసుపెట్టె
సత్యవా క్కాంతపనిచేసె సాహుకారు.

కొబ్బరాకు "బూరా" యూదుకొంచు వచ్చి
యమ్మ! మోటారు వెళ్ళెడు నంచుఁ జెప్ప
సరగ నార్గేంద్రకొడుకును జనని "యిదిగొ
అన్నముం దిను పోద" మం చదను తెలిసె.

గోడ కట్టుటకై యుండుఁ గొండరాళ్ళు
గుట్టగాఁ బోసి రటకుఁ బోఁగూడ దమ్మ
చిఱుత! అటఁ ద్రాఁచుపా మొండు తిరుగు చుండె
మఱియు నది మానిసింబోలె మాటలాడు॥

ఎంత వెగ్గలైతి నోయి నీ కింతలోన
దానిపతి పోయినంతన దాని వదలి
నావు పతి నఖక్షతములు నా యురానఁ
గాంచి యిప్పుడు ననుగూడఁ గళ్ళసింతు,

ప్రియుడ! యెఱుఁగను మునుపటి నెలఁదుకల స
తివ్రతాత్వ మెట్టిదో! వారు తిట్టినంతఁ
జచ్చును కిరాతుఁ డగ్నియుఁ జల్లఁ బడును
నన్ను నీ వొక్కఁడే చావు మన్నఁ జత్తు,

అతనిచదువుకు సంవత్సరాంతఫలము
స్కూలులో వానిపేరును కొట్టివేత
స్కూలు కెదురుగఁ జిక్కనికూఁతు రున్న
కాఫిహోటలువాసి తగ్గనిఋణంబు.

అల నిడదవోలులోన నాహారమంత్రి
తాను బెదరించెఁ బెద్దవర్తకుల "నిట్టు
లైనను గవర్నమెంటె ధాన్యంబుకొను" న
టంచు, 'వారును మనుజులే' యనియె శెట్టి.

ఆలోచన చేయఁగవలె
నాలోచన లేక తెలియ దర్థము, మఱి యా
యాలోచన విషయజ్ఞత
కాలోచితమైన స్ఫురణకలిమి సాగ సగుణ.

ఓసి! చంద్రుఁడు చల్లఁగా నుండు నంచు
నన్నమాటలు నిజమైనయట్లు లేదు
పది నిజమైనదిగనుక యిద్ది నిజము
అబ్బఁటియాకులో! గందమో! అలరో! చివురో!

మొన్న నే నంటివే నీవు చిన్నెలాఁడి.
లేమ యూసానకురుపులు లేచు నీకు
తాళుకొనలేక పిసుకుఁదును స్తనయుగంబు
నిద్దనలికె బాధపడుచుంటి వేమి యనుదు.

"వాయిలు" చీరయు రవికయు
కోయిలకంఠమును కండ్లద్దం గాళ్ళకు
ళ్ళా యలరుఁ బ్రక్క-పాపట
యీ యంగన యంగజునకు నే నుముఁడారో!

తనగది నద్దపుఁ జేరలో
నుని చెన నొక ప్రిన్సిపాలు యువతియు; తన్నునుం
డును కాలేజీచదువరు
లసోతిన ర్తనము తెలిసి యాది శిక్షింపఁగా.

ఏ మహారాణి లేచిపోయినను మఱల
దా మహారాణియే యగు దాని కేమి
పోసి వెఱ్ఱిబాగులదాన యుండి నీవు
లేచిపోయినను 'బజారు లేమ' వగుదు.

చెలువ యొకతె చింతచెట్టు పై గుల్లలు
కోసి తినఁగ నడిగెఁ కుర్రవాఁడు.
తనకు నొకఁడు విసరు మనుచు నా సింగారి
పులుపురొడ్డు నీకు వలవ దనియె.

అతని కేమొ 'కాపింగు' లే దంచు వంక
వీఁడు 'బియ్యె' పరీక్ష తప్పె నని సబురు
పాయఁ బలికెడు నెన్నొ సంబంధములను
అంగజున కామె యేసు మేక య్యెఁ దుదకు.

పెల్లుగ వర్షర్తువు మరు
నల్లసి భూచక్రిగొడుగునాఁ జనుదెంచె౯
చెల్లీ! బావకు సెలవులు
మల్లడి వేసంగి మూఁడుమాసము లేలో!

అరకోడి యన్న నెంతా
దరమో మఱి యంత పెద్దతల్లికిఁ దొలిచూ
ల్బరువున బొంగరము నభం
గురగతిఁ దిరుగాడుఁ జిన్నకోడలిఁ గన్న౯.

ఒగి విశాఖపట్టణమున నొకకృష్ణీడ
రొకకవి యుపన్యసింపఁగా నాఁది వినుచు
తెలుఁగులో భావ మింత వ్యక్తీకరణము
సులభ మంచు నెఱుంగ నంచు వచియించె.

ఎంత యల్ప మా ప్రాణులో యీ జగత్తు
తాను పనిచేయుచోట నుత్సవము జరిగె
శివుఁడు తొలినాఁడు తలపైన శీతకిరణుఁ
దాల్చికొన్నట్టు లయ్యె నీతని యెడంద.

వచ్చె "మెట్రిక్పరీక్షకు" ప్రబల కుండ
లాలతోడ "ఘనాపాఠి" బాలమూర్తి
చచ్చి సాధింతు నన్నట్టి సామ్య మయ్యె
బ్రిటిషురాజ్యంపుఁ గైతవ విద్య నీతి.

మొదట నన్నట్టి మాటకుఁ దుదిని నేఁటి
మాట కావంతయైన సంబంధ మున్నె
దానిపొడయే యెఱుంగనిదానికిని, ల
తాంగి సుతుమీఁది ప్రేమకు నతికిపోయె.

చివుర! నీ తలలోని జేజెమ్మవంటి
వారుకూడ గడ్డి కఱచినారుసుమ్ము
ఋతు. వొక వసంతమే కాదు ఋతువు లాఱు
కలవు చివరకు శిశిరసంఘమ్ము కలదు.

దాని నెఱుఁగుదు మఱియును దీని నెఱుఁగు
దు నని యూరక యెతుబారుతనము పోదు
పాటితోఁటలోనను జొన్నగూటికాడ
చెందనైన మర్యాదలు చెప్ప వేమి?

అప్పటికి వెన్నెలయుఁ బోవు నప్పటికిని
జలియు నోయును బయట స్నానమును వేతు
నంతదాఁక ఘన బసిమీఁద మధుగవ్యములు
నప్పటికిఁగాని తొల్లి తా వసిమొ భ్రష్ట.

కొడుకునకు నీవుసై తము వడుగుచేయ
నేల యూ నాను బ్రాహ్మణ్య మింతరొంపిఁ
గూరుకొనిపోయినప్పుడు కూర్చి లాగఁ
గాను వలయును జందెపుకాళ్ళు వేసి.

వరుని కూటమిలోన జాగరమువలనఁ
గను లెఱుపు తోఁచెఁ దొలుసంజకామినికిని
ముదుసలితనంబుచేతను నిద్దురరాక
కను లెఱుపు తోఁచె మలుసంజ కామినికిని.

నలుగురును బందుగులు కూడినారు మీరు
కడఁగి తీర్పుచెప్పవలె నిష్కర్ష గాఁగ
నతివ పుట్టింటి కేఁగితి నంచుఁ జెప్పె
నటకుఁ బోలేద దీనికి నర్థ మేమి?

ఇంతి! నీవుగాని యెగఁజేపె నని గేదెఁ
బట్టి కోల్పుచువ్వ బాదినావు
తెల్లవారికూడ ధృతిలేదు నిన్ను నే
నువ్వగింజయంత నొవ్వఁబలుక.

తాఁ దులుపఁబోవఁగా బ్రహ్మదండిగింజ
గ్రుచ్చుకొనె ముల్లు మాలెతగోటిలోన
దాని ప్రియుఁ డెంత యిబ్బంది యైన పడెను
దాసితను వెంత నిమిరిన రానె లేదు.

తెలితోవ పూరేకున లో
పల ప్రాలిన తేటి సరసిపడఁతుక నును చె
క్కిలిఁ బుట్టు మచ్చపోలిక
విలోకనకృతార్థతా నవీనతఁ దేల్చెఁ.

రాజకీయజ్ఞు లెల్ల సారస్వతమ్ము
కూడఁ దమరె యేలింగిన గొప్ప వోవ
నంద తెలిఁగిన రాజకీయమ్ము లకట
యొక్కకవులే యెఱుంగరా! యుర్వియందు.

సూర్యుచుట్టు తిరుగు చున్నది భూమి నీ
వెఱుఁగుదే యనంగ నెఱుఁగవలెనొ
భూమి స్త్రీయు నినుఁడు పురుషుఁడు నెవ్వరి
చుట్టు నెవరొ నీవ చూడు మనియె.

గుడికిముందు కట్టిన క్రొత్తగోపురంబు
టెక్కెమునఁ బావురాయి కట్టినది గూడు
ఒంటరిది యొక్క యందాల పెంటికొఱకుఁ
గువకువలు లేక కనుల దిక్కులను జూచు.

వదల స్త్రీకళాశాలను పడుచు లెల్ల
జనుచు నుండి రలంకారశాస్త్రసరణి
భావజుని మౌగ్ధ్యమాదిగా ప్రౌఢివఱకు
భావములు వేసి కవి యేరుపరచినట్లు.

అక్కగారిని గొనిపోవ నరుగుదెంచి
తేను దానిఁ బంపించ నన్నాను మఱఁది
నాకు వేసిన శిక్షయే నీకుఁగూడ
నన్నిటను వేసెఁ గార "మర్ధర్ధ మణుగు".

ఉదధి నీ రుత్క్షాళించి పై లేమిసి తిట్టి
చెరువు నీటి ప్రాశస్త్యంబె చెప్పఁజొచ్చె
కడలిపై నుండివచ్చిన గాలి ప్రాణ
శక్తి యందు నారోగ్యరసంబు కూర్చు.

విపులతరమైన భాషా
నిపుణత లేకయ విమర్శ నెగడించు నహో
కపురంబు పునుగు నత్తరు
నపుంసకుఁడు వాడినట్లు నల్దిక్కులకున్.

కొండ లెపుడు రసాబ్ధి మేఘుని విదల్చి
నేలకును లాగుటకుఁ బ్రయత్నించుచుండు
నతఁడు తగినంత వర్షించి యరిగిపోవు
కొండసెలయేళ్ళతోఁ దన గొప్ప చెప్ప.

ప్రక్క నద్దె కున్నవారి భాగంబున
సుతకు నిన్నరాత్రి శోభనంబు
నిదుర లేదు సువ్వె గది గది యంటుక
యున్న దయ్యొ నడుమ సన్నతడక.

నీదు చలువవలన నే సినీమాతార
నైతిఁ బెండ్లికూడ నందుకొఱకె
కన్నెఱికముమాట కాదట్టు లుంచుము
మదిని నిన్ను నేను మఱువఁగలనె.

అబ్బురముగఁ దండ్రి డబ్బీయ డనిగదా
చేడె వదలి నన్నుఁ జేసికొంటి।
రామె యిపుడె పెండ్లి యాడకపోతిరా
తండ్రి కిపుడు మీరు తగ్గి లేరు?

అర్థముం జేసికొనువార లున్నచు లేక
వ్యర్థమైన మహాకవి వాఙ్మోల
నకట! "ప్రాజెక్టు" కట్టు దిశఁ గనుచుతో
జాజువారెడు గోదావరీ జలంబు.

మఱియు బీళ్ళు మునుపె మాగాని యయ్యెను
కాల్వగట్టు పాటఁ గట్టునడియె
నూరిపశువు లెల్లఁ "గారుల" కడ్డుగా
గడ్డికరచు చుండె రోడ్డులందు.

శారద శారద యందురు
శారద న న్నెఱిఁగినంత జన మెఱుఁగుదురా!
శారదకుఁ గీర్తి కలదా
యూరా! యిందఱు నిరక్షరాస్యులలోనన్.

కలవా! లేవా! అసలు ఖాళీలు మఱి తీరి
కయును లేద యిపుడు కాగితములు
చూతు రాతీరికిని సుందరి! రమ్ము రా
తీరికి గంట లెన్మిదింటి కైన.

భర్త పోయినవేళకుఁ బడతి విషము
పుచ్చికొని చచ్చిపోయెను బాలఁతిఁ గూర్చి
వేయి యనుకొన్న యూరెల్ల విస్తుపోయె
యువకుఁ డొక్కఁడు పెండ్లినాఁ డుస్సు రనఁగ.

తనభార్య ప్రక్క నుండఁగఁ
బనలుగఁ గ్రమ్ముకొను మొగులువంకం గాంచె౯
మును పితఁడు యక్షకాంతా
జనమునకుఁ బ్రవృత్తిఁ గొంచుఁ జనె నని పతియు౯.

అమ్మ! రాముఁడు చంద్రు ని మ్మనుచు నడిగె
నంట భూగోళశాస్త్రమ్ము నప్పుడు చెప్ప
లేదు కాఁబోలు నన బిడ్డ క్షేమ, కొడుకు
సాఁగి యింగ్లండు చన్నట్లె సంతసించె.

మన మేమొ వెలవెలందుల
మును మనతోఁ గూడి వేసమును వేయదో! ఆ
తనబ్రతుకు పెట్టుకొని తా
ననవలసిన మాట కాదో యానో యెఱుఁగదే.

ఎవడో! యొక్కవిప్రుఁ డీతనికి నపకృతి
చేయఁ గులము నెల్లఁ జెట్టతలఁచు
ఇట్టివారు పూర్వ మెందు లేరు, ఉ
ఉండును జనమేజయుండు నిదియె.

కలువ, తమ్మిపూవు చెలియలు నక్కయు
సోకలందు మంచిపోల్కి కలదు
ఈమె పవలె దాచు నామె రాత్రిదాయ
నిందులందుఁ దేటిమిండగాండ్ర.

తినుటకుం దిండి లేదు వ్యాధి ప్రబలి పడి
పోయి "డాక్టరుఁ" జూడఁగాఁ బోయినంత
తగినసలహాకుఁ బది యౌషధమ్మునకుఁ బ
దియును బండ్లు కయ్యెడునది దేవుఁ డెఱుఁగు.

కొన్ని నాజూకుమాటలు కొన్ని గాలి
మాటలును చిల్కపల్కులు మూటకట్టి
యైన శారద చవుక నృత్యంబు నెఱపఁ
గేవల మ్మామె కిచట "మార్కెట్టు" బలిసె.

కవులు నేఁడు రెండు రకాలు: కాళిదాసు
మొదటఁ బిమ్మటఁ దా నది మొదటిరకము
మొదలు తుదయును దానె యా పూర్వకవులు
కవులు "బూర్జువా" వృద్ధి రెండవరకంబు.

అవునుగాఁ గైతలో విషమాంకురములు
పడిన తప్పకయ తగిలివచ్చు ననుట
వాని కథలకు మఱి వానిభార్య యిట్టు
లాయె ననుటకు నది సరిపోయెఁగాదె.

ఆ సంపన్న కళాసిధి
భాసుర మగు యౌవనమునఁ బ్రాణము వీడెన్
వాసిగల పండితులు దీ
ప్రాసమబాణుండు నాశ్రయములకుఁ జెడఁగా.

ఓసీ యచ్చర! యే మా
యాసంపడినావె స్వర్గమందున నీవున్
మా సీమ కిపుడు వచ్చితి
మాసర శిశిరార్ద్రుఁ డైన మలయాసులుతోఁ.

చైత్ర మాసంబునందున సంజవేళ
నేటియొడ్డున నూహాచే నెడఁద కనఁగ
దూఁకు కళ్యాణరాగమ్ముతోడఁ గలసి
వచ్చు పద్యమువలె వచ్చె భాసురాంగి.

అకట! నూతనదేవాలయం బొకండు
కట్టుటన్నను బుట్టెడు కంటగింపు
నందె హారిజనదేవాలయ ప్రవేశ
చటులయాత్రలఁ దట్టెడు సంతసంబు.

వారి దొడ్డినుండి వీరింటి గడకిని
జెంత వ్రాలె సీమచింతకొమ్మ
గోడ కొంత రాచుకొన క్రిందిముం డ్లూడ
వచ్చు నెట్లు పోవు? బైని ముండ్లు.

కోపపడకు మయ్యా! కుహనామనోజ్ఞాత,
వయసు దాఁటినట్టి వారితోడఁ
బడుచులకును బెండ్లివల దన్నమాటలు
పేరు తెచ్చుకొనఁ బ్రచార మింతె?

పగలు తప్పకపోయెడి పడతులందు
నిశలఁ దొలఁగిపోవరు సగానికి సగంబు
ఆ సగంబున సగము నీదైన యురము
మూచుకొనవలె బెజ్జాలు చొరకయుండ.

నలమహారాజుబోలు నుజ్జ్వలులు మఱలఁ
బుట్ట రంచుఁ బౌరాణికుఁ డట్టె చెప్పె
నరయ నాకాశరామన్న యట్టివాఁడె
వాఁడు వాఁ డని తెలియని వాఁడుగాదె.

మతము లేదందు రేకాని మహితమతులు
గాంధియస్థికల్ నదులలోఁ గలుపు టెంతో
హిందుమతము సమాధిపై నెల్లవారు
పువ్వులమాల లుంచుటయుఁ గ్రైస్తవమతంబు.

పోవుచుం బోవుచును నేర్పిపోయె బ్రిటిషు
వాఁడు మా నూత్న దేశీయ పాలకులను
రేషనింగును లాటిచార్జియును నంది
పొందని జవాబులును బ్రశ్నములకు సభల.

మగువ బిడ్డలుం నీదు రోమయ్యగాంధు
తలఁప నలిపిరి క్షాగీతంబులు నయంబు
కాంత యొసమిదిపాసాల గర్భితైన
కాంతునిఁ గన్నుఁ గలిఁకిడు గదినిఁ జూచి.

పృథివి దేవుఁడులేడు చూపించు మందు
మనము దేవుళ్ళ మే మఱి మనకు మనము
నైనఁ గాకున్న భార్యల కైన నప్పు
డైనఁ గాకున్న మఱి చచ్చినప్పు డైన.

ఒక యధికారికి "స్త్రై"
ప్రకటిత సిశేయందుఁ బంపఁబడు వస్తువులకు
"తకతై తక" తన కూఁతురు
ప్రకటా ప్రకటముగఁ గానఁబడె నట కథలు."

వరుస వావి లేదు వర్ణమ్ము జాతియు
లేదు మంచి చెడ్డ లేదు సువ్వో
వయసుమాత్ర మొకఁడు పాటింపఁబడుచుండె
నదియు పెండ్లి చేయు నవసరమునను.

మన బిడ్డలమును దారిం
జనుచుండగ నిన్నుఁజూచి శ్వానము మొరుగం
గను నీకె తెలియవలయును
తనరగ నీలోని దొంగతన మెట్టిదియో.

బావా! నీ కూఁతురు నా
పై వేసెమకన్ను చంకపట్టుక దిగదే
చావమొ మరునకుఁ జనుఁబా
ల్ద్రావువయసునందె యింత దగ యుండినచో.

విస్తరిసి [illegible] [illegible] [illegible] పొంగు
లారు నన్నమ్ము [illegible] మనుజుమా [illegible]
మానవుడు [illegible] [illegible] [illegible]
సాధ్యమై [illegible]

నాకు నొక్కటికొక్కట్టును నీకు నొకడ
యేమి యన్యాయ మనఁగ "నా సామి" యనియె
నాకు నారొన్నులే మరి నీకు నారె
నాకు జరిగినయట్టి యన్యాయ మెంత.

స్కూలు ఫైనలు ప్యాసైన సుదతి కేమొ
భర్త గాఁ గలెక్టరు గాని పనికిరాదు
ఈమె బి. ఏ.; వివాహ మింకెట్లు జరుగు
తత్సమపతులు లేనియట్టి యీ కాలమందు.

మీ యుద్యోగి యొకండ
న్యాయమ్ముం జేసెఁ జూడుఁడని మొఱవెట్టన్
మా యుద్యోగియు మఱి య
న్యాయంబును జేసె నందువా యని తన్నెన్.

పిల్లికి బిచ్చము పెట్టని
యుల్లసి పదిమంది యనిన నేమి ఫలం బా
యి ల్లతసి దాతృతాగుణ
మెల్ల నరసి రావుబహాద రిచ్చిరి కాదా!

అసలె శిష్యసంచార మంతంత యయ్యె
నందులోన నూరూరను జందెములును
వేసి బ్రాహ్మణు లగుచుండ విప్లవంబు
జతనుపడె విశిష్టాద్వైత మతమునకును.

మా వారికి రైల్వేలో
నే షెసిలిక లేదు రాత్రి రెల్లను పనియే
మావాడ దొంగభయమును
నీతో బలశాలి యుండె నిశాంబాంతాడే!

వానిఁ జంపినాఁడు వానిభార్యను తన
పడతిఁ జేసికొనియెఁ బుడమిఱేఁడు
ప్రేమ యనుచుఁ గవులు విరచింప గీతాలు
శిల్పిజాతి రాలు చెక్కినారు.

ధరణిపతి చేయు ఘోరకృత్యములు చూచి
పరమ మైన ప్రజావిప్లవంబు జరిగెఁ
గొంత జరుగ, విప్లవనాయకుల నొకండు
వట్టి రా జేమి టని చక్రవర్తి యయ్యె.

పలుకుబడియు నధికారము
గలవారికి నెంతమార్పు కలిగిన నైనన్
జలిచీమ లైనఁ గుట్టదు
తలక్రిందై ప్రళయ మైన ధారుణి నెల్లన్.

విదలింపఁడు చేయి ప్రభువు
విదలించున యెవఁడుగాని పేద యడిగనే
ఇది కలికాలము కావునఁ
బదిమందియు సంఘ మడుగ వంద లొసంగున్.

మరిమాంద గలుగు శరదుల
మరుఁడు తిరుగుఁదండ్రియంట మాదిరిగాని
తిరిపవు గాడిదకును నా
మరుసింగని రామేంద్రషెట్టి మణఁగుట పనియా.

పైని డేగ దైవ బాంబింగు చేయుతో
క్రిందఁ దళ్లి [illegible]
పిల్ల రందుఁ బిల్ల జెల్ల [illegible]
ఎయిరు [illegible] దిజె [illegible].

పగిలి చను ప్రత్తికాయల పాటికాక
అల్ల మిణుగురు పురువులయంత లేక
విరియచందిరు వెన్నెల చదల నెక్క-
నల్పకవి దైనయట్టి కీర్త్యాశపోలె.

బ్రాహ్మణ బ్రాహ్మణేతర భావసంధి
వశతఃప్రాణాలుపోయెడు వార లెవరు?
అచట నిచట ధనమ్ము లేనట్టివారు
అట నిటఁ గులమ్ము పోట్లు లేనట్టివారు.

వాఁడు సప్తాహములు చేసి మేడకట్టె
వీఁడు నుద్యోగముం జేసి మేడకట్టె
వాఁడు దొంగయటంచును వీఁడు, నరక
లోకమేఁగు వీఁడంచు లో లోన వాఁడు.

పత్రికల నీవు వ్రాసెడి వ్యాసములను
చూచి శృంగారభావమ్ము చూరగొంటి
వసి తలంచితి దయచేయు డయ్య యింక
మీకడఁ భావ "మర్థషలాను" లేదు.

ఈ పాడుసినీమా కథ
లీ పత్రికలందు కథలు నే నమ్మితి న
య్యో పాడుచేసికొంటిని
కాపురమును చేతఁ జిప్ప కట్టియు వచ్చెఁ.

తెలుఁగుదేశాన యువకులు త్రిదశు లైరి
మొట్టమొదట్ల శాస్త్ర పురాణముల నిరసన
పైన దేవుఁడు లేడన్న పట్టుదలయు
సూటిగాఁ జిట్టచివరకు షోషలిజము.

సరదాను వేటలాడును
బారియలలో నక్కి చిక్కంబో దని నక్క
బారిం జిత్తులమారి యనుచు
విరచించెను మనసి; క్రూరవిధ మిది యగుంచో.

అడవి యుద్యానముం జేతు రనుచు నీవు
చెంద నేల ముదంబు కసిందమొక్క!
సినుం బెరికి ప్రోవువెట్టి యెండించి యెరువు
చేయ కున్నను జాలు నీ జీవితంబు.

అంటంబోకు మొక్క గవర్నమెంటు మాత్ర
పడను దిట్టుము నీ యిచ్చవచ్చినట్లు
కొంచెముగ నోట్జగా "సెర్కు"కూడ కలుపు
పత్రికల యమ్మకము నా జవాబుదారి.

చెలఁగి నీకును కీర్తి నార్జించునట్టి
ప్రతిభ లే దొక్క చక్కని బాట కలదు
శక్తిగలిగి యెవ్వఁడు ప్రతిష్ఠకును నెక్క
వానితో నీవు పత్రికావైర మూను.

ఎత్తు గిలకబావి యింతి నీరముతోడు
రాజు చుండె ప్రాయ్యి రైక లేదు
ప్రియుఁడు కెలన నిలచి వీక్షించు చున్నాడు
పడతిచేద న్నూత వదలివేసె.

కరవఁబోవుచు న్నట్లుగా నటించు
కోరలం దింపక్షయు మెడల్ కొరికికొనును
వైరముం బ్రేమ యొక్క జాతిభావము లని
వ్యాఖ్యచేసెడు కుక్కలు లాడుకొంచు.

మంచమునసుండి కోపాన మగువ మాటి
మాటికిని లేచి పోవఁగా మగఁడు తాను
రాత్రి, మంచమ్ము కుక్కి-గాఁ ద్రాళ్ళుకోసె
పడతియును లేచిపో సులభంబుకాక.

తిండి లేనట్టివారికిఁ దిండి యిడదు
తిండి కలవారిదగ్గరఁ దీయుఁబన్ను
ఉర్వీపతికంటె దంతవైద్యుండు నయము
పన్ను కట్టును లేనట్టివాఁడు చనిన.

పువ్వుటమ్మ్మల పొదివోని నవ్వ శాలయ
నడిగితివ యేని నే బదు లాడలేను
వ్రాసి యిచ్చెద నీదగు వర్తనంబు
మదియుఁ గలదేని నీవుగాఁ జదువుకొనుము.

అత్తా! చూచుచు నవ్వెదు
గిత్తవలెఁ నీదు కొడుకు కేరడములు పే
ఱెత్తి మితిమీరు చున్నా
డుత్తది నన్నన్న లాభ ముండదు పైనఁ.

పగటి గృహభారవశతఁ గోపంబు నూను
శ్రమభరాలసయై మలుసంజవోలె
మఱియుఁ గులకామిని నిశాప్రమాణముగను
మెల్లఁగఁ బ్రసన్న యగును జాబిల్లివోలె.

వట్టియాశతో నేమి లాభంబు; కీర్తి
కాంతఁ దార్తురు పత్రికాకాంతలు కవి!
నమ్మి వేసియు మఱి దేశనాయకులను
పోయి యిద్దియె బుద్ధ మేమొ! కనుగొనుము.

బోట్లుకాలువ, రెండువైపులను గలవు
గ్రామములు, స్నాన పానముల్ కాల్వయందె,
తెరలి మన్మథుఁ డచట వంతెనలు కట్టు,
కోర్కెమెయి జలాంతర్గామికూడ నౌను.

తల్లి పయ్యెద కదలినఁ బిల్లవాఁడు
లేచుఁ దల్లియె లేచిన లేవ డెట్లు
భర్తకడ సుంత సదురింపఁ బడతి చేయు
నఖిలయత్నమ్ములు నమన్మథార్పణములు.

స్మరదృశుఁడు "కాస్మపాలిటన్" మహిసి లేదు
కడగి పూరుషు లంత "బిగట్సు" లేరు
చెన్నపురి కాళిఘట్టపు సీమలందు
తెల్ల "బ్రాథెల్సు"లో నల్ల తెల్ల పోర్లు.

అందఱును కోకిలను మెత్తురం చతండు
కోకిలను దిట్టుచును వ్రాసెఁ గ్రొత్తపాట,
యెవరు చెప్పిరో కోకిల కీ విషయము
వానియెలనాగ గొంతులో వచ్చికూయు.

ఒక యలవాటుగ దయచే
నొకనికి నేదేని యిచ్చుచుందుము కొన్నా
ళ్ళకు మానుము మానినతో
నకటా! దుర్మార్గుఁడై తి వా క్షణమున నే.

కడఁగి 'కాన్స్టేబి' లైన నీకంటె నయము
కాస్త మోటారునకును టిక్కట్టుకూడ
నాకునైన సంపాదింప లేకపోతి
నాల్గు వందలు తెచ్చుచున్నావు మాటల.

వణఁకుచుండిన యొకపేదవాఁడు వచ్చి
కరము చాచిన బొమముడిఁ గసరికొట్టి
నప్పుడే "కాఫిహూటలు"నందు బాంగ
రాల మిత్రుల మేపి దర్జానెలార్చె.

మా యింటివెనుక భర్తయు
జాయయు, పిల్లులు నయుంబు సగము మిగిలిపో
రేయి యగుదాఁక; గర్భిణి
యాయమ యేఁటేఁటఁ బ్రేమయదికాఁబోలున్.

తన మాతృభాషలోపల
మును చదువక యుండ సంద్రములు నాల్గాపోఁ
శనముంబట్టిన నైనను
జనుసి తెలివి తల్లినేల సంస్కృతిఁ గనునే

వృత్తులు గుణాశ్రయము లని వేర చెప్ప
వలెనె మీ యన్నదమ్ములవంకఁ జూడు
నీ వుపాధ్యాయుఁడవు మాటనేరుపరివి
నీ సహోదరుఁ డేమొ పోలీసువాఁడు.

ధనవంతుఁడు నధికారియు
బొనరించిన చిన్నపనిని బొగడుదు రెపుడున్
ధనహీనుఁడు విద్వాంసుఁడు
పొనరించిన గొప్పపనియు బూజుంబట్టున్.

అతనిభార్య పుట్టింటికి నరిగె వాఁడు
వంట చేసికొంచుండెఁ దానొంటరిగను
అంతనే వున్నదే "కూరలమ్మి" లోన
నెన్నికూరలు కొన్నాడొ యేమొకాని.

ఊరిజనంబుల దైన యు
దారత నడిగెదవు పాంథ! తమబావులలో
నీరే త్రావుడు రెప్పుడు
నేఱును ప్రవహించుచుండ నే నీ కెలనన్.

ఎల్ల పెఱచెట్ల చివురాకు లింత మండు
వేసఁగికి నీనకట్టున వెలయు చుండ
దీనికిం జీమ కుట్ట లేదే నెలంత!
మావిచివురు చల్లఁదనంబుమాలు చెప్పు.

ఆయెడ సంగీతోపా
ధ్యాయుఁడుగా వెలుఁగుచుండ నార్నెల లందున్
మీ యల్లుని నీ యూరనె
వాయించిరి పుష్పశరుని బాజావోలెన్.

అతఁడు మరి నాస్తికుఁడ నంచు నంత చెప్పి
తనయునకు జబ్బు చేసినతరుణమందు
నెట్టుకొను జ్యోతిష్కులచుట్టుఁ దిరిగె
వేడిమొయి ముట్టఁ జదివించె నాడు వెల్ల.

ఊరిచెత్త నూడ్చు నువిద మురుగుకాల్వ
లోనఁ దీసి బురదలోన వెదకు
సర్వజన్మఫలము సంధిల్ల నిటు పుట్టి
మరియు నేమి కలదొ, మమత విడక.

శ్రీమంతులు ధీమంతులు [illegible]
నీ మనుజుల వేరు వేర సృష్టించు విధి [illegible]
గామించినట్టి శారద [illegible]
పై మో[illegible]

గాజు నిలువుబొమ్మను దేహావర్ణ కలిత
"వాయిలును" గట్టి నిలఁబెట్టి వర్తకుండు
దాని నుల్ల కనుంగొంచుఁ దా నతండు
కోరచూపులఁ గంచు షోకులనుబోవు.

ఒంటరిగ నిల్చియున్నట్టి యువిదఁ గాంచి
మీఁది యే యూరటంచుఁ గన్నీటి యడుగ
విర విరల మోము గర గర ల్పెదవి బిట్టు
చుర చురల్ కన్నుగా వానిఁజూచె నతివ.

నల్లకుక్కఁ జేతుఁ దెల్లకుక్కగ నంచు
సబ్బుపెట్టి యొకఁడు జమురుచుండ
నెవఁడో నవ్వె నొకఁ డేల కాకూడదు
మానరాదు యత్నమైన నన్నిటను.

మేనమామ గారిపూజ లైన వేళ
విసుఁగుకొని "సంకఁ గొంచెము వెడలుపైన
మూతిగల తట్ట తెచ్చిన మునిఁగిపోవు
నేమి యవ్వారి దైన సొమ్మెల్ల" ననుచు.

వేద శాస్త్రములకు రక్ష వెలయుకొఱకు
రాజు లా పూర్వమగ్రహారంబు లిడిరి
ఆ మహాగ్రహారంబుల ననుభవింత్రు
సిగ్గుచెడి వేద శాస్త్ర విక్షీణమతులు.

ఒకఁడు సంధ్య వార్చ డొకని కధ్యయ
నంబు లేదు కర్మనమ్మకమును
సిరియు సమముగాన చెడియె బ్రాహ్మణు లందు
నొక శాఖకంటె నొకఁడు గొప్ప.

కనకదుర్గ నవ్వులకుఁ బుల్కలుగ వచ్చె
మల్లికార్జున శివదేవు మౌళివీధి
వెన్నెలలు కృష్ణ చల్లనిపిచికలను
పూచికలముండ్ల పోలికఁ బొడుచుకొంచు.

కాశిలోన నుద్యోగము కలుగు నతని
కల కుదిర్చిరి సంబంధ మతఁడు వచ్చె
స్నాతకము వేళ నురలఁ గట్నంబుమూట
లేచి నిజముగాఁ గాశికి లేచిపోయె.

పుడమి మున్నేలితి మటన్న మిడిసిపాటు
ముసలిమాన్లు నియోగులు మొదలుగాఁగ
విప్వదుం బడ నాంగ్లేయు లిప్పు డేలు
చుండి పడుచుండిఁ గన్నఁ దప్పొండు నేమి?

కడఁగి కమ్ములు పిండిన గంజిమడత
తెలయుఁ జూపులు కిఱ్ఱుచెప్పులును గలుగు
పెద్దయాసామి, కుప్ప నూర్పిడి కడియము
కుసుమశరునకుఁ బెట్టనికోట యయ్యె.

వానిమొగంబున కది యెపు
డైనను నొకయేన్గు నైన హంసను నైనం
గానీ చూచెనె? తనసతి
యా నడచెడునట్టి యందమది యెఱుఁగంగన్.

అచటఁ జెల్లె లున్న దక్కఁగా గ్లుండిరి
పట్టపగలు నేను వత్తు నేని
అకట! వార లేమి యనుకొందు రన భార్య
అవును వార లెఱుఁగ రనియె భర్త.

తనకుఁ దెలియనియపుడు పద్యమ్ము వ్రాయు
నెవఁడుకాని మహాకవియే తలంప
తనకుఁ గోరిక లేనప్డు వనములోనఁ
గలుగునన్ని వృక్షమ్ములు కల్పకములె.

ముదిరిపోవుచు నున్నారు పూవుబోండ్లు
పితృగృహమందుఁ గట్నముల్ పెరిగిపోయి
మనకు మతమైనలేదాయె మఱియు వారి
మిషనరీలుగ నెటకొ పంపింప నైన.

మొగమునందున సౌమ్యము బిగువు జఘన
మండవిని గల్గునాయమ మొగఁడు నూర
నున్నఁ గన్నెత్తిచూడదు చన్నత్రోవ
నతఁడు లేకున్న సుంత కన్నాడుచుండు.

ఇంటిలో దీప మున్న దం చెవఁడుగాని
పండువెన్నెలలో నారుబయటఁ బోడు
పోయినను తప్పె? వెన్నెల పులుఁగువోలె
కాంతిదారాల నిచ్చెన కట్టుకున్న.

బ్రాహ్మణులు పూర్వ మపకారపరు లటంచు
వచ్చి నపకీర్తి యెట్లును వచ్చెఁ గాని
పూర్వబ్రాహ్మణుల్ సంతానమునకు "బ్రిటను"
చేత "లవణుసు" లేకుండఁ జేసినారు.

మొగిలు పట్టినంత ముగుదకన్నుల తుదల్
పులుకు పులుకు మంచు పొడుగుసాఁగ
మేయు చున్న యెడ్ల మెడలోని గంటల
యులివునకును బ్రిమసి యులికిపడెడు.

శ్రీమంతు లయి కనకదు
ర్గామోహన దర్శనంబు గావింపఁగ వీ
రేమో సన్యాసు లయి స్వప్ర
హాంమృషఁ గొలిచెదరు మల్లికార్జున దేవుఁ.

ఆ రోడ్డున స్త్రీ పురుషులు
జారత చోరతయుఁ జేసి సంపాదింపఁగ
దారిద్ర్యము తెగకున్నది
హూరా! గడ యెక్కు వృత్తి యంతర్హితమై.

ఓయి! కార్యమునకుఁ బోయెడి మిత్రుఁడా!
ఉవిద నీకు నణఁగి యుండుటయునో
ఉవిద కీవ యణఁగి యుండుటో తొలిమూఁడు
రేలయందె నిగ్గు తేలిపోవు.

అందముగ రాలిపడి ఫాల్గునాంతమందు
దట్టముగఁ బూఁత యీ వేఁప చెట్టుమొదట
నున్న యిరుపక్కబండలం దుదితగంధ
వారణ కపోలయుగమునాఁ బరిమళించు.

చిన్నిసిగ్గులు కొలఁబోసికొన్నవేళ
నిలువు నిలువున స్నేహంబు నిండిపార
నల్ల నేర్చెను మఱఁదలు నావు నేయి
కీలు కొలపోఁత యప్పటి గిద్దఁ జూచి.

క్షితి నదృష్టవంతుఁ జెఱుపువాఁ డెవ్వఁడు
కవికి ముట్టలేదుగాని పైస
యాసకొలఁది నతఁడు వ్రాసిన కవితచే
ధనికునకును భోజతయె ఘటిల్లె.

మట్టి మోయ నటంచుఁ బ్రాల్మాలిన దని
కోపమున భర్త భార్యనుగొట్టి మట్టి
యంతయును దానె మోసి తా నతివ యన్న
ముం దినద టంచుఁ దా నన్నముం దినండు.

స్రస్తకటిచేలకంచుక, శ్లథకచాళి
యైన నెలనాగ నిద్రాభరాలసాక్షి
తానె వంటిల్లు సర్ది మూఁతలను బెట్టి
దానె దీపము తగ్గించె తరుణిభర్త.

స్వామి! యిందు మన్నఁ బైపైనిమాటఁగు
నేమి సేతు నల్లె యేగు మన్న
నెఱుఁగలేవె నీవు నిష్టమ్ము తే వందు
పూరకున్నఁ గోష్ఠమూర్తఁ జూతు.

వాని కులమునందు వాడె విద్యావంతు
డింత డబ్బు కీర్తి సుంత కలదు
కులములోని పూరుషులను దేవుఁడు వాఁడు
వెలఁదుకలకుఁ బూవువింటివాఁడు.

పెట్టెలో నున్న గుఱ్ఱపుతట్టుఁ బట్టి
నులకత్రాఁడు కళ్ళెముకట్టి వెలచె స్వారి
తుమ్మపీకెల నది పడద్రొబ్బె నంతె
యెవరిమాటలో విని పుత్త్రి నేల నెగువ?

ఆమె యొక్క కళాస్థానమధర మయ్యె
నంత వెగ టయ్యె నోరు బింబాధరకును
కార్తె కార్తెకు మున్నును గాని చినుక
బోని యాకాశమును గాంచి పొగులు భర్త.

ప్రతిదినమ్ము సాయం సాంధ్యరాగసుషను
లతసి మొగముననే చెరలాడు చుండు
ప్రతిదినము నప్డు వచ్చెడు రైలులోన
నాడువా రున్నపెట్టెను నభిముఖముగ.

ఓరి పిచ్చివాడ! యుర్విలో స్వారిచే
యంగరాని గుఱ్ఱ మంచుఁ గలదె
చెలఁగి యది "హారాము" చేసిన నైనను
గొంత; తుదకు రాతుకొలఁది కాదె?

తరఁగతులకొలఁది గవ్వ లుం
దురు శర్వాణీమనోజ్ఞ నూపురములు పై
తరఁగతి; మఱి పరమాధమ
తరఁగతి ఖిల్లీదుకాణదారుల మిత్తురిల్.

ఇంద్రుఁ డైన గాని యింతటిసిగ్గు తాఁ
బడఁడ టంచు నెంతుఁ, బడతి యంత
రైక చీర యొడలఁ గ్రమ్మి యున్నవిక దా
కోమలాంగి కెందుకో మరంత.

అవనిఁ బెద్ద యుద్యోగస్థు లదొకజాతి
పేదల యదృష్టమును పీక పిసికి చంపి
మన లదృష్టంబె లే దందు రాత్మగోప
నంబుచేయఁగ నెన్నిమార్గంబు లొప్ప.

మనుజు లెల్లరును సమానంబె యందువు
నమ్మసష్ట ముండి నమ్మలేను
తెలియ నొక్కఁ డొకఁడు తీయు గోతులలోతు
వేరు వేరుగాఁగ వెలయు చుండ.

పురుషులకుఁ దప్పులేదుగా! పొలతి, నేను
కాక మఱి యెవ్వతెయు నైనఁ గలదె యన్న
నున్న నున్నది యనుదు లే కున్న లేద
యనుడు దానికిఁ గోప మే లరుగదేర?

చిలవలు పలవలు నూరక
కలిపించుచు నేల పలుకఁగా? మీకును నా
లలనకు నేమియు లేదని
చెలువముగా నేన మున్న చెప్పితినిగదా!

అతఁడు పత్రికనుండి యాలకించుచు నుండె
నంచుఁ దెలిసి యొకతె యతసిభార్య
తోడ నన్నదోఁ "బూవుఁబోఁడి! నీ పతి, పూవు
టమ్ము వాఁడు నన్న డమ్ము" లనుచు.

వాఁడు శిశువనియంతవాఁడు కన్నొక్కచే
పెడన యున్న నేమి? జేసి కాదె?
శిశువు మేనఁ గొంత చెఱిసగ మయ్యె స్త్రీ
ప్రకృతి వాని దగు స్వభావమందె.

ఉన్నవారను లేనివా రున్నవారి
కే మొసంగుదు రనుట యదెంత నిజము
మొయిల! మాఁగానిపై గుండపోఁత యగుదు
చినుకు చినుకవు మా మెట్టచేలమీఁద.

ఆడవారిపిఱుఁదు లరసి యూరక యిట్లు
బ్రమసిపోదుగాని బావ! నీవు
నీవు చీర తాల్పు! నీ పిఱుందుల సోకు
నరసి జనము లెంత మురియఁగలరో!

అటకపై నుండి దూఁకి వాఁ డరుగుదెంచి
నీపయి వసంతముం బోసెనా! పడంతి
ఊరిదేవునకును వసంతోత్సవంబు
జరుగఁగా దేవి కేటికి జరుగరాదు.

రెండు పిడిరాళ్ళు మోసెడి “శాండొ” వోలె
ఉవిదయే తాను ముందు కూర్చున్న నైన
బ్రిదుకనీయఁడు గుర్రపుబండివాఁడు
వెనుక బరు వంచుఁ దెగ గోలపెట్ట దొడఁగె.

తెలివితక్కువకూడఁ బతివ్రతాత్వ
గుణమునను నలంకారము కొన్నియెడల
నక్షరము రాదు తనపతి కతఁడు పండి
తుండటంచును దా జెప్పుచుండు నామె.

ఆ యొంతో గొప్పనటునకు
మాయురె! రంగమ్మునీఁది మాట యటుండెం
బో! యింటివద్దసైత
మ్మా యేకస్త్రీవ్రతంబె యభినయ మయ్యెన్.

శ్రమపడి యొకసారియె యా
దమయంతికి మున్ను హంస దౌత్యము నెఱపెన్
శ్రమ లేక వేయిసార్లీ
దమయంతికి హంసగమన దౌత్యము నెఱపున్.

నిలచె నిన్న మొన్నటు మొన్న నేఁడు, నెల్లి
యును మ ఱెల్లుండి యావ లెల్లుండి మాతు
మఱి యటావ లెల్లుండియు మఱలి రాదొ
వనితఁ బుట్టింటినుండి రావలవ దనుము.

ఒడలఁ జెమటపోసెఁ గడు రొప్పు చుంటివి
కొస బుజాన నంటెఁ గుసుమరజము
పడుచుదాసి మగడ! నడియెండఁ బూఁచిన
బీరపాదు త్రవ్వపెట్ట నేల?

రోజు రోజుఁ జెల్లి బూజు పుల్లకుఁ జుట్టి
బూచి యంచు బెదరు పుట్టఁజేయు
చెల్లి బదులు తీర్చెఁ జివురాకు జొంపంబు
అక్క కిపుడు బూచి యంచుఁ జూపి.

ఇతఁడు గాని యప్పు డిప్పుడు పసివాఁడె
చిన్ననాఁడు తండ్రి చేయుచుండ
జపము, తానుగూడ జపము చేసెడివాఁడు
ఇపుడు దొరలఁ గాంచి యిట్లు చేయు.

తెలియదు దానికి లోపలఁ
గల కోరిక వెఱ్ఱిమొఱ్ఱిగాఁ గనుచుండున్
దెలియును దీనికి నే గతి
ఫలియించునో యెండుకుండపగిదిఁ జరించున్.

స్త్రీ లుదుకుచుండ స్నానాల రేవులోన
వయసు రాకుండ నూహాలు వఱలునట్టి
సోఁగచూపుల బాలురు మూఁగినారు
చేరి తరువాతఁ గబురులు చెప్పుకొనఁగ.

పురుషుండు బృహన్నల జం
టలు జుట్టుది మాచకమ్మ సుతుఁడు కలిగె ను
త్తరగోగ్రహణ ఫలంబో
మఱి.యీచుకపోనకున్న మహిమ య దేదో!

ఇంత చదువులేక యేదో 'సిఫారసు'
వలన గొప్పపదవి వచ్చినట్లు
తనకు దేవుఁ డట్లె కనిపింపవలె నఁట
జపము తపము యోగసరణి లేక.

అల్లఁ ద్రుంచి పూజాపాత్రయందు నుంచ
నీ ప్రసూనకన్యకలకు నెంత సిగ్గు?
నన్నుఁ దెలిసెను స్వామి యర్చనక టంచు
నొక్క-డొక డత్తుకొని హాస మొలుకుచుండె.

'ఓరి సఖ! నన్నుఁ జూచి యా నీరజాక్షి
మొగము నటు త్రిప్పుకొనియెఁ జిన్నగవుతోడ'
'త్రిప్పుకొనవచ్చు నీవు చంద్రుఁడ వౌటఁ
జిన్నగవు కాదు మూసుళించుఁ జెలువు కాని!'.

పూవు, చిన్న పసరుమొగ్గ కాకయమున్న
సన్న యీనవోలె నున్నయట్లు
వలపు, సిగ్గుగాఁగఁ బరిణమించకమున్న
బాలయందు భయమువోలె నుండు.

అమ్మమ్మా! నీ చిన్నత
నమ్మున నట్టిట్టు చూచినావా! లేదా?
మ మ్మనెదు! కృతయుగమ్మున
నోమ్ములు లే వటవె? ఆలకుం గిత్తలకున్.

నట్టువగుచుఁ బుంజు, చుట్టుపల్ పచరింపఁ
గదల దాడుబాతు, కామజాతి
పఱచి కూఁతవెట్టి మరియూదగల కోడి
పైన లజ్జ నెంత యందగించు.

బోటు బిడ్డ లల్లె పోటీలుపడి యామె
కంటె నీమె యీమెకంటె నామె
మగల బొమికలేర, నగలకై; చివరకు
చెలుల పతులు రాగిచెంబు లైరి.

చనుము విటకాఁట! మీవంటి జనముకొఱకె
పరగఁ బెండ్లిం డ్లటంచు నేర్పఱచినారు
తమరిసొమ్ము నీవఱకె వృథాగఁ దింటి
నురక మా యింటిచుట్టును తిరుగఁబోకు.

తండ్రి చిననాఁడె చనిపోయెఁ దలలు మార్చు
మేనమామకు "మేనేజిమెంటు" వచ్చె
నల్లునకు నిర్వదేండ్లకు నధిక మైన
వీలులేదు "మైనారిటీ" వెళ్ళె ననఁగ.

ఆ మహారణ్యమందు దావాగ్ని పుట్టి
యామినీవేళ వీచెఁ దీవ్రానిలంబు
జాతిసంజ్ఞలు చెడి లింగసంజ్ఞ మిగుల
నాడుసింగంబు దుష్టితో నభిగమించె.

తొయ్యలీ! నేను నీ డబ్బుతోడఁ జదివి
యక్కటా! యిట్లు నీ భర్త నగుటకంటె
వానివలె నిన్నుఁ జదివించి భర్త నేను
కాకయుండిన నెంత సుఖంపదుదును?

వానిగడ్డమ్ము పెరుగుట వానిదైన
యట్టి వ్యవహారసాహచర్యము; మునసబు
కోర్టు, సబుకోర్టు మఱియు హైకోర్టుదాఁకఁ
బెరిగి పెరిగి హఠాత్తుగా గొరుగు డయ్యె.

వ్రాసి కవనమ్ము వాఁడును వాలిపోను
చెట్టయొడుపులు చేసి మా చిన్నదాన్ని
బాడుచేసినయది కాక పద్యములను
వ్రాసి మాకథ యూళ్ళపైఁ బంపు నంట.

జంటగిరులవెనుకఁ జంద్రోదయంబు కాఁ
బోవు నాకసంబుపాలు పెసంగె
నెఱ్ఱపునుగు గలిపి యేన్గుదంతపుఁ బొడి
తీర్చు శబరి శంతదేశమట్లు.

నూటయిరువది నైంబరు మాలుపైన
రంగుచీరదోఁచె నాయుల్లు! తరుణి మిన్న
తెల్లచీరను ధ్రౌళించి తెలుపు వెంట్ర
దెప్పు న్యాయంబు తోఁబాడ "సెల్ఫ్‌డిస్ట్రస్టు" యేమొ!

క్రొత్తభార్య మగనికొఱకు గంజియు బువ్వ
కులుకు నడలతోడఁ గొంచురాఁగ
దున్నుచున్న మగఁడు దూరానఁ బ్రియఁ గాంచి
మిగిలినట్టి చెక్క మిగులఁబెట్టె.

కాలేజీలోఁ బదుగురు
బాలికలను నామె యొకతె పాపము గోలాం
గూలము తక్కినవారలు
కౌలేయము లామె చదువు గట్టెక్కింపన్.

"బడికి నేను బోవఁ బ్రతిదినంబును నన్ను
వెంబడింతు వేల? పిల్లవాఁడ!"
"బడికి నీవు పోవు, బడిదాఁక నే బోదు
నన్ను నడిగినావె? నన్ను నడుగ.

ప్రన్న తేనె యేరుపడని చిన్నరిమొగ్గఁ
గదిపి పారిపోయె గండు తేఁటి
తోఁటమాలి దాని దోరింపఁ దిరిగినఁ
బ్రోడ పూలు దాఁచె ముకుళములను.

పిల్లి పీఁచరకాయలుఁ బేర్మి నూఁచ
బియ్యమును, బాడుకొంచును బెద్ద యన్న
దిన దినమ్ముఁ బాలమునుండి తెచ్చు నంట
పట్టిచేతుల నింటికి వచ్చు నేలొ?

ఆమెజడ దీర్ఘముగ నుండ నతఁడు వలచి
తెలివఁ బెండ్లాడుదాఁక నిదిరించలేదు
పెండ్లితరువాత, నవరముల్ విలిచి తేఁగ
నింతి యూతని పదురింపనీయలేదు.

ఎన్నెన్నిదార్లో? మూసిన
దన్నన్నియు నామె; కూఁతు నాసను దనకుఁ
ము న్నున్ని విటులు చేసిన
పన్నుగడలఁ దొల్లి తా నుపాధ్యాయకదా!

పలకయు బలపమ్ముం గొని
తలవంచుక వ్రాయు చున్నతనయుని తలయే
పలకపయిఁ గలదు; తెలిక
న్నులకొసలవి తండ్రికాళ్ళనుం గనుచుండెఁ.

దేవుని పూజార్థముగాఁ
బూవులు తెచ్చితివి సగము పూవులు వలపుం
దేవేరి కట్టిపెట్టితి
భావకవుల సగమునంశె పట్టెను నీకుఁ.

నిజము, నీ వన్నయట్లుగా నీదు కైత
వేదమే, వేదమం దెంత వేద కలదు
కామయజ్ఞాని కభిచారహోమములకుఁ
దగిన యర్థర్చలు యజుస్సులుగ వెలుంగు.

ప్రాణములకు లోపలిదగు
ప్రాణములో నున్నవలపుఁ బైదలి యిట్లుల్
మేనునకును వెలుపలిదగు
మేనునఁ బచరించి వాసిమిత్రికిఁ దెచ్చెన్.

అతఁడు, భార్యవిటుని, యందంబు, తెలివియు
జదువు మాటి తీరింతో ప్రశంసించు
జనులయందుఁ బుణ్యజనుల 'కేటాయింపు'
వినఁగ మున్నె చెప్పె వేమయోగి.

ఒక్క యెఱ్ఱగన్నేరొకొక్క! మందారంబు
దాసి తాత, యనకు తావిమాట
జగతి నెంతమంది? జాలి యుండదు కాని
పొంగుకోప మన్నఁ బుట్టకొలఁది.

ముగుద! తీయకు! గుండ్రని మొగమునకును
బ్రిక్కపాపట యందంబు పట్టి యియ్య
దిలకమచుకొని పెడచార, నెనఁగు పండి
నెర్రినార్వింజను రసజ్ఞ లేరికొనరు.

పరమసుకుమార! నల్లుల బాధ హెచ్చు
మా గృహంబున, బ్రక్కింటిమగువ, ముసలి
దైనఁ బడుచుదనమ్మున వగాసుకత్తె
సన్నపాదుది తృణమైన సంతసించు.

కావ్యములలోనఁ గలుగు వ్యంగ్యముల నెల్ల
మాట మాటకుఁ బట్టించి మగువలందు
బావ పడిన యిబ్బంది, తత్ప్రథితకావ్య
ముల రసాస్వాదనాసుఖంబులకు రాదు.

ఇద్దఱు మిత్రులు తొలి రే
ముద్దియలం గలసికొన్నముచ్చట లాడన్
బ్రొద్దయిన, జరిగి రొద్దకు
నొద్దకు నూహాలబలంబు లూరించినటుల్.

వాని బంధుగులందున వాని బావ
గ్రుచ్చుకొని కొంచెముగఁ బైకివచ్చినాడు
బావకు 'ఫాట్కో' సమస్తమా భావములను
నీతి, సంఘమ్ము, కవనమ్ము, నిఖిలమందు.

చిన్నిసందు వేఁపచె ట్లిరుప్రక్కలను
పూఁత వగరు తావి బుగులుకొలిపె
కులము, గర్వరేఖ, వెలయుఁ బ్రౌఢాంగనల్
కోసచూపు లోలయుఁ జేసినట్లు.

క్షత్రియుల విజైనగర భూజానులందు
నల్ల బొబ్బిలి మున్ను, శౌర్యంబు నెఱపె
నౌర! బ్రాహ్మణుల "నినాముదారు" లందు
నేఁడు బొబ్బిలి మఱి రాజనీతి నెఱపె.

అట ననార్యదేశంబులయందుఁ గొంద
ఱార్యుల మటంచుఁ బెఱల సంహారమాడ
ఇచట నార్యభూమిని గొంద ఱితరులందు
ద్రావిడుల మంచు సాఁగింత్రు దండయాత్ర.

అస్వతంత్రదేశంబును నద్దెయిల్లు
తెలియ నొకదాని కొక్కటి తీసిపోదు
ప్రాణము సుఖంబుగా నుండ బ్రదుకరాదు
శాంతకాములు పెద్దలు చావరాదు.

కూలితట్ట నెత్తిన వేసికొని చనంగ
మున్ను, వెనుక మామ సరాగములను విసఱఁ
దట్టనిండుగఁ దెలినుర్వు తెట్టెకట్టె
చాన చిఱునవ్వు తెలిబులాకీని దాఁటి.

పల్లెటూరివారు పదిమంది యువతులుఁ
వెంటఁగొంచుఁ జిన్నపిల్లవాఁడు
సంబరంబునందు సగముచచ్చి చరించెఁ
దాన శాలిపాలి నెత్తికొనియట్లు

పౌబుమెయి నెంతో “యడ్వర్టైజుమెంటు”
చేసినను వాఙ్మయంబునఁ జిన్నమంత
మళ్ళకుండుటచే “సినీమాను” జేరి
గుప్పు మని వాఁడు వడ్డితో గుంజుకొనియె.

పక్ష నిర్ణయంబు పద్ధతి సరిలేద
యువిద! నవమిమొదలు నవమివఱకుఁ
బక్షభేద మేరుపరచినచోఁ గృష్ణ
పక్షభావ మెంత పదిలపడును.

నీచేఁ బనిచేయించుక
నీ చేసినచేఁత బరిగణించదు మేలం
చే చనవు కృతజ్ఞతయును
దోఁచఁగనీ దదియసువ్వే దొరతన మనఁగా.

బడిఁ గులాచారమునుబట్టి ప్రాఁతనగలు
పేర్మి బొమ్మకు రంగులు వేయుగాని
తానుమాత్రము నేఁటికాలానికైన
"ప్యాషనే" పోవు నీ మెచ్చివాండ్రపడుచు.

వయసుచే మిన్ను మన్ను కన్పడనిదాన!
ఆనుపూర్విగ వచ్చెడు నాముద్దంబు
దివ్వె పెట్టుమ! యెక్కఁడో చివ్వపుట్టి
ఆరు నూనెలకై యంగలార్చఁబోకు.

బిట్టునడిరేయి వీఁచెడు వెఱ్ఱిగాలి
ఆకసమునందుఁ గార్మబ్బు లావరించె
ఒంటరిగ వచ్చెదరె తమ్మువంటివారు
సందు చెడ్డదిగద! ప్రతిష్ఠానిధానె!

డాక్ట రిచ్చెను ప్రాణముల్ డాక్టరునకు
మఱల నిచ్చుచు నున్నది సరసిజాక్షి
అతఁ డీయసి తొలినాఁటి ప్రాణములకు
హక్కుదారుఁడు తా నేల నటుమటింప.

నదిని మలుసంజయొత్రన నలుపుతిరిగెఁ
బల్లగాఁ జల్లగాఁ దోలెఁ బైరగాలి
యపుడ నిదురను మేల్కాంచి యావలించి
పడతి, తా నాడుపులివోలె బయలుదేరె.

అతఁడు నే నప్డు చచ్చిన నతనిభార్య
వలెను నడుగుకతిసిదు నా భార్యగాను
యున్న యుద్యోగమున కెంత యుదరిపడిరొ
నతఁడు పండుగమామూలు నడిగినంత.

సకియ! నా భార్యకును బిల్లలకును ద్రావ
గంజి దొరకెను నీ భర్తకరుణవలన
నీ సుఖంబున కేమిలే! తీసివేయఁ
బోకువే చాన! మా నోటి ముందుకూడు.

నా తెల్లనిమైతీవకు
మీ తిలకము; చీర, రైక మేలా? కుహనా
చేతోజన్ముడ! నాపైఁ
బీతితొలంగకు, వికారరీతిగ నున్నన్.

భార్యతోఁ బ్రియమాడుట పరమమిత్రు
తోడఁ గష్టసుఖంబుల నాడ వెలితి
పడుటయును వానిసృష్టించి బ్రహ్మ సంత
సించె వేలోకబ్రహ్మ సృష్టించితినని.

ప్రియముగ లోపలిరాతికి
రయమున నిలఁబడు జపాను రబ్బరుబొమ్మల్
నయమునుమి! మనుమరాలా!
అయయో! సీ కొడుకుకన్న నాలోచింపక.

"సన్ను నా కిత్తు నన్నారు మున్ను చెలియ!
యెందుకో మఱి తప్పిపోయినది గాని"
"ఎందుకో యేల? నీ వన్న వేను చెల్లె
లను మ ఱే పూర్వజన్మమందుననో గాని".

అతనివలనఁ బూర్వమ్ము సాహాయ్య మందు
వార లొక్కొక్క డొక్కరూపాయి నొసఁగ
నుండ దీ నేమిః కాని కూర్చుండినారు
చెట్ల నెక్కి వారలుః వాని చేతిచలువ.

గర్భముననుండి పడి రాలుగాయవోలె
మునుపు విస్తళ్ళు కుట్టి జీవనము చేసెఁ
గడుభయము; పోవు నసి రాలుగాయతనము
నేఁడు విస్తళ్ళుచింపి మండించుఁ బదవి.

అతనియుద్యోగమున కెప్పుడైన సుంత
గొఁడిగుడుకు వచ్చెనే నిలువెడలుగాసి
అతనిభార్య: లేకున్న శుద్ధాంతవాసి
నంతతీవ్రత పెఱసతులందు లేదు.

పదిమంది యెక్కఁద్రోసిరి
పెద్ద న్యాయమ్మైన కోపమోఁ చెడి వానిఁ
గదలించిరి ముందుననును
నోదవిన దుర్వ్యాళ విషధయోగ్యులు వారల్.

వాఁడు తనభార్యమీఁది కోపమ్ము నెల్ల
పాండవుల భార్య ద్రౌపదిపైనిఁ జూపె
నధికముగ నేమిచేయుః శౌర్యంబు చచ్చి
మాన మూడ్చిన దగు జాతిలోనఁ బుట్టి.

"అయిసు లాండు" దేశస్థుఁడు నెలరుతోఁట
కేఁగి మందారము గులాబి యెర్రగన్నె
రగసి యన్నియు నొక్కటే యంచుఁ దలఁప
వానిపైఁ గోప మేల విద్వాంసునకును.

ధన మధికారము చదువును
దనరినయెడ గర్వ మున్నఁ దగునో తగదో
ధన మధికారము చదువును
దనరనియెడ గర్వ మున్నఁ దప్పక తగుఁబో.

వారి యింటను గ్రొత్త దైవతము లరుగు
దెంచి ప్రాఁతవారల త్రాళ్ళు త్రెంచినంత
నింటిలోఁ ద్రాళ్ళు తెగినట్టి యింతు లుండ
వారు వీరును జతకట్టినారుసుమ్ము.

ఆ యూరిలోన దారిం
బోయెడి యేనుఁగులఁ గాంచి మొఱుగుచు నున్నం
బాయక కుక్కలు నవ్వుచు
నా యూరిజనంబు పెంతు రఁట వానిబలే!!

మిషనరీలు రైల్వేవారు, మేటిపత్రి
కలును పాలించుచున్నారు. తెలుఁగుభాష
తురకలును సినీమాలయంత్రములును రేడి
యోస్టేషనులు తీర్తురు తెల్గువాచకంబు.

తండ్రి! చదువులకై పరస్థలము దూర
మరుగు చుంటివి! యిదిగాక మఱచిపోకు
పేర్మిఁ బ్రాణముల్ నీ పైని బెట్టికొంటి
మేను ముసలిని నీభార్య తేనెవాక.

దారి నడచుచు ముందుకుఁ బారఁజూడ
నెంత రమ్యంబుగా నుండె నీ స్థలంబు
ఇటకుఁ జేరినతరువాత నేమి కలదు
ఇతరదేశంబులంబలె నిదియు నంతె.

మా యావిడ పుట్టింటికిఁ
బోయెడు నెలనాళ్ళలోనఁ బొలతీ! నీవున్
మా యింటికి రాఁదగదా!
మీ యింటను మదనుఁ డిట్లు మిడుకుచు నుండున్.

అయ్యో! యీ దీర్ఘవిరహిణి నాదరింపఁ
బోదువా? యేమి? యచటికిఁ బోయి యామె
మోము చిక్కినచంద్రుఁ డామె కనులు
నరవిరియుఁ గల్వపూవులం చనకు బాబు!

ఎప్పటిమాటయొ దెప్పెద
విప్పుడు పదియేండ్ల మీఁద నెప్పటి కపుడే
కప్పెదు నెరసులఁ దేనియ
దొప్ప వనుచు నెంచినాఁడఁ దొయ్యలి! నిన్నున్.

అతఁడు "నార్మాన్షియరరు" నాట్యమ్ము చూచి
వలచి, యింగ్లీషు నొలికించి వాయు వలపు
గమ్మలకు జవాబుకోరుఁ గోళ్ళు గొరుకు
వారఁ దిరుగుఁ దపాలా కచేరిచుట్టు.

పొట్టివానినిఁ గోసి పైకి నెట్టుచుంటి
వెంత నెట్టిన వాఁడు పై కెక్కఁగలఁడు?
తనకు నక్కఱలేనట్టి తాటిపండ్లు
నెవఁడు తాఁ గోసికొన్న నీ కేమి స్వామి!

వ్రాసె నొకకొంటె "నోబెలు ప్రైజు" వాసి
కిత్తు రని యీ యుగాదికి నే విమాన
మరుగుదెంచినఁ దనకోసె మంచుఁ జూచు
"ప్లేను" దిగుటకు "డ్రో" మైన లేని యూర.

మంచెమీఁదనుండి మంటిచెడ్డలు వడి
సెలను బెట్టి పిట్ట సెలగు పడుచ!
వదలఁబోకు సేలపారుగా బెడ్డను
మీ పొలంవైపు రేపు రాను.

ఓసి మొదటిబండ! యుదయాద్రియును నీవు
నొక్కచోటఁ గూడి యున్న నైనఁ
గొమ్మతోడ దీటుగొని మాటలాడను
ఖచరు లైన నవ్వఁగలరుగాని.

వలపు గలుగు ననుభవం బది వేఱును
వలపులేని యనుభవంబు వేఱు
ఆటవికులు తేనెగూట మంటలు పెట్టఁ
గొనుదు రల్లఁ దేంట్లఁ బెనుచువారు.

తరుణి సిందుచూలాలు నోదార్చఁ బతిని
"నాకు నోపిక లేదాయె, మీకు మీరె
ప్రక్క పరచుకొందురు నాకు వక్క మడచి
కొంద్రు వీవనతో వీచుకొందురి" రనుచు.

వేదపురుషుఁడు నన్ను లోభి వని తెగడెఁ
గావ్యకర్త నిజ దాతవుగాను బొగడె
అగుణము నధర్మమును మేఘమా! కృతాన
గలిసి గుణమును ధర్మంబుగాఁగ మారు.

అధిక శక్తిమంతుఁ డాశ్రయింపఁడు వేని
నల్ప శక్తిమంతుఁ డాశ్రయించు
నాశ్రయింపకున్న నమరవు పదవులు
పదవి కలుగువాఁడె ప్రభువు నేఁడు.

జనులు పరభాష చదివిన
విసుగమకముతేని యూహావీధుల వెంటం
జను వారి వాదవైభవ
మనలముచేఁ బ్రేమ దీప్తమగు నన్నట్లోల్.

ముష్టికవి తాటియాకు చప్పుళ్ళు చూచి
రాజకీయాధికారి సారస్వతంబు
సిగ్గు తెలియని యట్టి కుందేలు బెదరి
వెసఁ బ్రయాణము కట్టె జాబిల్లిదాఁక.

నీ మొదటిభర్త పైనను నీకు వలపు
పొందియుండెనా యని పునర్భువును గోర
అతఁడు చనిపోయి న్నాతఁడు పతివి నీవు
బ్రతికి యుండితి వేమి టీ ప్రశ్న యనియె.

హూణుఁడు తన భార్యచేతఁ గృతార్థుఁడయ్యె
నల్లె యింగ్లీషు చదివెడు నట్టినీతి
హూణులు భార్యలచేతఁ గృతార్థు లగుదు
రల్ల ముష్టులు హిమవంతు లగుచునుండ

ఆ యందఱ కత్తియం గనెఁ
గాయజమతి కోరచూపుగాఁ "గమ్యాని
ష్టా”యము వాసిని శునక
ప్రాయముగాఁ జూచె హాస్య భావనపాంథుఁ.

పచ్చ విలుకాని సంతగఁ
జొచ్చెదరా వెలఁదిఁ బగలుచూచినఁ గలలో
వచ్చెడు నాతఁడు మిక్కిలి
సచ్చరిత యటంచుఁ దలఁపసాఁగెను మదిలో.

క్రొత్త శికమారు త్రాడుతోఁ గోడెదూడ
క్రొత్తకుట్టిన లాగుతోఁ గొడుకు కుర్ర
చిమ్ముకొను నేలఁబడి మన్ను చేసి కొనఁగ
రైతు రెండు రెండంటించె ఖేతగాఁగ.

భరతదేశాన మున్ను కొందఱు తపస్సు
చేసి ఋషులైరి నేడు మాసీమయందు
ఇంగిలీసు గ్రంథమ్ముల నట్టె చదివి
అట్టె బ్రహ్మర్షు లగుచుండి రద్భుతముగ

క్షితిని బ్రాహ్మణ ధర్మంబు చెడె నటంచు
భూసురుఁ డతండు దుఃఖించు సభలయందు
మెడను జందెము లేనట్టి కొడుకు జీత
మెప్పు డభివృద్ధి యగునని యింటియందు.

ఒగి సిఫార్సు జాతి కుద్యోగము లొసంగ
నీతి చచ్చుఁ జచ్చు జాతిశక్తి
జాతిశక్తి చావ స్వాతంత్ర్య మిన్నాళ్ళు
నిలుచు నన్నయట్టి నియతి లేదు.

కల్లుత్రావుట తప్పును గాఁడి త్రావు
టొప్పు మరి వారకాంతలు తప్పును గుల
కాంతలొప్పునుం గులవృత్తి యద్ది తప్పు
మహిత మగు నిరుద్యోగ సమస్య యొప్పు.

ఐహిక స్వర్గలోక సౌఖ్యములు తెచ్చు
కవి వలపు, నన్నుఁ బ్రేమించుకాంత నతఁడు
డబ్బుగలయట్టి పెద్ద ప్లీడరుకుఁ దార్చె.
నంత నాపైన విరహకావ్యంబు వ్రాసె.

బడలి తల్లి లాగుబండితో గుఱ్ఱపుఁ
బిల్ల పరుగువెట్టు నల్లజాతు
లెచటి కేగుచుండె నెఱుఁగని పాశ్చాత్య
నాగరకత వెంట సాగునట్లు.

నేటికాలంబు నందుఁ బండితుఁ డెవండ
నంగ సుప్తిజంతముల చందం బెఱుంగ
కున్న యాతఁడు పురుగులు తిన్న తాటి
యాకులను లెక్కపెట్టెడు నట్టివాడు.

ఎంతో బ్రతికిన నింక నాల్గేండ్లు బ్రదుకు
నట్టి తనదైన పదవికై యాత్మ దేశ
మొక సహస్రాబ్దిగాఁగ బంధకిగఁ జేయు
వానికై క్రొత్త స్వర్గనిర్మాణ మొప్పు.

తినునది గడ్డి, మరిం దమ
చనునది యొయ్యార మేమి జంతువులు ధరఁ
తన యులుపపు టధికారము
జనునకు నదియెంత స్వర్గసౌఖ్యము తెచ్చుఁ.

ఆ మహారాజుదగ్గర నతని కున్న
పలుకుబడి యెల్లఁ బున్నెము పండినట్లె
ఎంతమంది పేద కులాలయింతు లతని
మూలమునఁ గాంచిరో రాజభోగములను.

తనకుఁ బై యధికారి పాదమ్ము లొత్తు
నతడు తనక్రింది యధికారులందుఁ బ్రళయ
రుద్రుఁడగు సూర్యపాద సాంద్రుండు చంద్రు
డల్పనిశలందు విరహిణులందు వహ్ని.

అసలె దిగనారిపోయిన యాంధ్రభాష
నా మహానుభావుండు విద్యాధికారి
యై మరిక మరియును దిగనార్చె నట్టి
నేరుపే వాసిపదవిసి నిలువఁబెట్టు.

పరుల కుపకార మొనరింప స్వర్గసుఖము
సంభవించుట యద్ది సంశయ విషయము
వేసి కుపకృతిచేతువో వానివలన
నీవు గడ్డిని గరచుట నిశ్చయంబు.

ఏ పద్యమ్మున కదియే
యీ పంచశతీకవిత్వ మీయెడ నెచటో
యేపి యొకించుక యూహా
వ్యాపారముచేయు మర్థ మందుకొనంగన్.